నోరూరించే... మనసునుదోచే...మైమరపించే.






క్రొత్త పార్లే

# పాపిన్స్

పండ్ల రుచిగల పిప్పరమెంట్లు

**5** పండ్ల సువాసనలలో **13** మధురమైన బిళ్ళలు-
తక్కువ వెలగల మక్కువ గొలిపే ప్రతి ప్యాక్‌లో—
నిమ్మ, మూసంబి, నారింజ, అనాస మరియు రాస్ప్‌బెరీ!

ఆ పండ్ల మజా తెలుసుకోండి పాపిన్స్‌నారగించండి-

everest/122b/PP Tel





ఈ మార్పు

# అమృతాంజన్ గ్రైప్ మిక్స్చర్

వల్లనే కదా!

అజీర్ణం, వాయువు, కలతనిద్ర, వాంతులు, విరేచనాలవంటి బాధలు వెంటనే తగ్గిపోతాయి. ఆకలి, జీర్ణశక్తి బాగా ఉంటాయి. పాపాయి ఆరోగ్యం బాగుపడుతుంది.




అమృతాంజన్ లిమిటెడ్

FDS AG 1659 TEL A

---







జలుబులు, తలనొప్పి, బెణుకులు, కండరాల నొప్పి — వీటిని చప్పున చల్లగా తగ్గించుకోండి. బాధగా ఉన్న చోట అమృతాంజనం రాయండి. వెంటనే గుణం ఇస్తుంది. 75 సంవత్సరాలపైగా ఇంటింటి దీపమై వెలుగుతోంది అమృతాంజనం! ఎప్పుడూ ఒక సీసా దగ్గర ఉంచుకోండి. అమృతాంజనం ఆదాచేసే పెద్ద సీసాలలోనూ, చిన్న డబ్బాలలోనూ కూడా దొరుకుతోంది. అమృతాంజనం 10 ఔషధాలు కలసినది. నొప్పులను, జలుబులను చప్పున చల్లగా తగ్గిస్తుంది.

అమృతాంజన్ లిమిటెడ్

# అమృతాంజనం

# చప్పున పోగొడుతుంది!

AM-5900A

ప్రతి మానవుడు పొరపాటు చేస్తాడు.
ప్రశ్చాత్తాపపడి పరిహారం చేసుకొనేవాడే నిజమైన మానవుడు.

అన్నపూర్ణ ఆర్ట్ పిక్చర్స్

# విచిత్ర బంధం










అబ్బురమైన కొబ్బరి చెట్టును సొగసైనంటి
గనిగెక్కి, తీ కొబ్బరి కాయలు కోసేశా!

ఈ న్యూట్రిన్
కోకోనట్
బాన్ బాన్స్
చేశా




తియ్యని, మెత్తని, కమ్మని గమ్మత్తు,
పిల్లల కిచ్చిన చెవలాయ్ వరం.
న్యూట్రిన్ కోకోనట్ బాన్ బాన్స్
రుచికరం!

ఒక్కొక్క మిఠాయి యందు
ఫలరస పూరిత విందు!




న్యూట్రిన్ కన్ఫెక్షనరీ కంపెనీ
ప్రైవేట్ లిమిటెడ్, చిత్తూరు (ఆం.ప్ర)

హృదయాలను కరగించే
కరుణామయ గాథ ......

ప్రసాద్ కంబైన్స్ సమర్పించు

# శభాష్ బేబీ

నిర్మాత-దర్శకుడు
ఎస్. ప్రసాద్

రచన
టి.పి. మహారథి

సంగీతం
సత్యారావు

కెమెరా
కె.సాంబశివరావు

ఆంధ్ర అపరాజిత SKP



SRI LAKSHMI ART

# చందాదారులకు గమనిక

'చందమామ' కాపీలు పంపుటకు మీ చిరునామాలో ఏదైనా మార్పుంటే 5-వ తేది లోగానే, మీ చందా నంబరు ఉదహరిస్తూ, మాకు తెలపాలి. ఆలస్యమైతే మళ్ళీ నెల వరకు మీ క్రొత్త అడసును అమలు పెట్టడానికి వీలుండదు.

డాల్టన్ ఏజన్సీస్
'చందమామ బిల్డింగ్స్'
మదరాసు - 26



# చందమామ

సంస్థాపకుడు : నాగిరెడ్డి
సంచాలకుడు : 'చక్రపాణి'

ఈ నెల బేతాళకథ ["దొంగకు సన్మానం"] బి. వాసుదేవరావు పంపినది. ఈ కథలో రాజు వర్తకుల చేతి కీలుబొమ్మ. వర్తకం సంపదను పెంపొందించదు; వర్తకులను ధనికులను చేస్తుంది; ప్రజల దారిద్ర్యం తీరదు. అటువంటి రాజు గజదొంగతో పొత్తుకలుపుతాడు.

"నేరానికి శిక్ష" అన్న కథలో మరొక రకం రాజు ఉన్నాడు. అతని రాజ్యాకాంక్ష అతని చేత భ్రాతృహత్య చేయిస్తుంది. ఆ పాపానికి అతను తన కన్న కొడుకుకే దూరమవుతాడు.

సంపుటి 51 అక్టోబర్'72 సంచిక 4






సర్పాః పిబంతి పవనం, న చ దుర్బలా స్తే;
శుష్కై స్తృణై ర్వనగజా బలినో భవంతి;
కందైః ఫలై ర్మునివరాః క్షపయంతి కాలం;
సంతోష ఏవ పురుషస్య పరం నిధానం. 1

[పాములు గాలిని ఆహారంగా చేసుకుని బలహీనంగా ఉండటం లేదు. అడవి ఏనుగులు ఎండుగడ్డి తిని కూడా బలంగానే ఉంటాయి. మునీశ్వరులు కందమూల ఫలాలు తిని కాలక్షేపం చేస్తారు. మనిషికి సంతోషమే పెన్నిధి.]

సంతు ష్యత్యుత్తమః స్తుత్యా,
ధనేన మహతా ధమః,
ప్రసీదంతి జపై ర్దేవా,
బలిభి ర్భూతవిగ్రహాః. 2

[ఉత్తముడు పొగడితే సంతోషిస్తాడు. హెచ్చుగా డబ్బిస్తే అధముడు సంతోషిస్తాడు. జపాలు చేస్తే దేవతలు సంతోషిస్తారు. బలులతో భూతాలు సంతోషిస్తాయి.]

సర్వహింసా నివృత్తా యే
నరాః, సర్వ సహాశ్చ యే,
సర్వ స్యాశ్రయ భూతాశ్చ,
తే నరాః స్వర్గగామినః. 3

[ఎలాటి హింసలూ చేయక, అన్నిటినీ సహించి, అందరికీ సహాయపడిన వారికి స్వర్గ సుఖం కలుగుతుంది.]

సంతోషం




# తెలివైన ముసలాడు

గ్రీసు దేశంలో ఒక ముసలాడూ, వాడి భార్యా ఉండేవారు. ఒకనాడు ముసలాడు తన భార్యతో, "ఏమే, డబ్బు అవసరంగా కావాలి. నువు సంతకు పోయి, మన ఆవును అమ్మిరా. నేనే పోదును గాని నా కాలు బెణికింది," అన్నాడు.

ముసలిది ఆవును తోలుకుని సంతకు బయలుదేరింది. ఆమె కొంత దూరం వెళ్ళే సరికి ముగ్గురు దొంగలు దూరం నుంచి, ముసలిది ఆవును అమ్మబోతున్నదని గ్రహించి, దాన్ని చవకగా కొనెయ్యటానికి ఒక ఉపాయం ఆలోచించారు.

ఒక దొంగ ముసలిదాన్ని కలుసుకుని, "మేకను అమ్మటానికి తీసుకు పోతున్నావా? ఎంతకు అమ్ముతావేమిటి?" అని అడిగాడు.

"నీకు కళ్ళులేవుట్రా? ఆవు కనిపిస్తూంటే మేక అంటావేం?" అని ముసలిది వాణ్ణి కోప్పడింది.

దొంగవాడు విచారంగా తల ఆడించి, "బామ్మా, నువేమన్నా కలగంటున్నావా ఏం? అది మేక. ముప్పై మాడలకు ఆ మేకను నాకు అమ్మెయ్యి," అన్నాడు.

ముసలిది వాణ్ణి తన చేతి కర్రతో ఒక పోటు పొడిచి, ముందుకు సాగింది.

ఆమె కొంతదూరం వెళ్ళేసరికి రెండో దొంగ తారసపడి, "అమ్మమ్మా, ఎక్కడిదాకా ప్రయాణం?" అన్నాడు.

"సంతకు, నాయనా. దీన్ని అమ్మమని ముసలాయన అన్నాడు," అన్నది ముసలిది.

"పాతిక మాడలకు నేనే కొంటాను. నాకు అమ్మెయ్యి," అన్నాడు వాడు.

"నీకు మతిపోయిందిట్రా? నిక్షేపమంటి ఆవును మేక ఖరీదుకు అమ్మమంటావా?" అన్నది ముసలిది.

రెండో దొంగవాడు ఆశ్చర్యం నటిస్తూ, "పెద్దదానివయావు. చత్వారం వచ్చేసింది.

గ్రీకు జానపద కథ




అందుకే మేకను చూసి ఆవు అనుకుంటు న్నావు," అన్నాడు.

"అయితే అయిందిలే!" అంటూ ముస లిది ముందుకు సాగింది. కాని ఆమె మనసు ఆరాటపడుతున్నది. తాను ఆవును తీసుకుని బయలుదేరింది గదా, అందరూ దాన్ని చూసి మేక అని ఎందుకు అంటున్నారు?

ఇలా ఆలోచిస్తూ ఆమె మరి కొంతదూరం వెళ్ళేసరికి మూడోదొంగవాడు ఎదురుపడి, "అత్తా, మేకను అమ్మబోతున్నావా ఏం? ఇరవై మాడలకు నేనే కొంటాను," అన్నాడు.

"అయితే ఇది మేకే నన్నమాట! ఇదేదో గారడీలాగుంది. నేను బయలుదేరినది ఆవును తీసుకుని!" అన్నది ముసలిది.

"అత్తా, నీకు పైత్యవికారం లాగుంది. ఇరవై మాడలకు నాకు దీన్ని అమ్మి, ఇంటికి పోయి నడుం వాల్చు!" అన్నాడు మూడో దొంగవాడు జాలిగా.

"ఒకడు ముప్పై మాడలిస్తానంటే ఇంకోడు ఇరవైఅయిదు అన్నాడు. ఇద్దరికీ కాదని నీకు ఇరవైకి ఇయ్యమంటావురా? ముప్పై ఇచ్చి తీసుకో," అన్నది ముసలిది.

"న్యాయంగా ఈ మేక ముప్పైమాడలు చెయ్యదత్తా! పోనీ, పెద్ద ముండవు! శ్రమ షడిపోతావు. ముప్పై తీసుకో," అన్నాడు మూడో దొంగవాడు.

ముసలిది తన ఆవును మేక ఖరీదుకు అమ్మి, ఇంటికి తిరిగి వచ్చి, జరిగినదంతా తన మొగుడికి చెప్పింది. ముసలాడు ఆ దొంగవాళ్ళ వర్ణన వింటూనే, వాళ్ళు పొరుగూరి కుర్రాళ్ళని పోల్చుకుని, "జరి గినదేదో జరిగిందిలే, జరగవలిసింది నేను చూస్తాను," అన్నాడు.

ముసలాడు బయటికి వెళ్ళి, ఒకేరకంగా ఉన్న రెండు కుందేళ్ళను కొనుక్కొచ్చాడు. అందులో ఒక కుందేలును బుట్టలో పెట్టి మూత వేసి, రెండో దాన్ని మరో బుట్టలో పెట్టుకుని బయలుదేరుతూ తన భార్యతో, "ఏమే, ఇవాళ మనకు అతిధులు వస్తారు. తేనె రొట్టెలూ, పాయసమూ, బాతు మాంసం వేపుడూ చేసి సిద్ధంగా ఉంచు.

నేను ఇంటికి వచ్చి, వంట ఏం చేశావని అడుగుతాను. కుందేలు వచ్చి చెప్పినట్టే చేశానను," అని హెచ్చరించాడు.

ముసలివాడు పొరుగు గ్రామం వెళ్ళే సరికి ముగ్గురు దొంగవాళ్ళూ పానశాల బయట జల్సా చేస్తున్నారు. వాళ్ళు ముస లాణ్ణి చూసి, "ఏం, ముసలాడా? నీ పెళ్ళా నికి ఆవు ఏదో, మేక ఏదోకూడా తెలీదే!" అని వేళాకోళం ఆరంభించారు.

"ఆఁ, దాని మొహం! దానికి మతి సరిగా లేదు. అయితేనేం? వంట దివ్యంగా చేస్తుంది," అన్నాడు ముసలాడు.

"అదీ కొంత మేలే!" అన్నాడు ఒక దొంగవాడు.

ముసలాడు ఆలోచన నటిస్తూ, "ఇవాళ ఏం వంట చెయ్యమందాం? పాయసం తినాలనుంది. బాతు వేపుడు కూడా. పోతే, తేనె రొట్టెలు కూడా తింటాం!" అని, బుట్టలో నుంచి కుందేలును పైకి తీసి, "ఒసే, నువు వెంటనే ఇంటికి పోయి, పాయసమూ, బాతు వేపుడూ, తేనె రొట్టెలూ చెయ్యమని అమ్మతో చెప్పు!" అంటూ వదిలేశాడు. అది చెంగు చెంగున ఎగురుతూ క్షణంలో ఎటో మాయమయింది.

"చిత్రంగా ఉందే! ఆ కుందేలు నిజంగా ఇంటికి పోయి నువు చెప్పినదంతా ముసలి దానికి చెబుతుందా?" అన్నారు దొంగలు.



"ఎందుకు చెప్పదూ? ఇంతప్పటి నుంచీ దాన్ని పెంచాను. నా మాట నమ్మకపోతే మా యింటికి వచ్చి మీరు కూడా భోజనం చెయ్యండి," అన్నాడు ముసలాడు.

ముగ్గురూ ముసలాడి వెంట వాడి ఇంటికి వచ్చారు. ముసలాడు, "ఏమే, వంట ఏం చేశావు?" అని భార్యను అడిగాడు.

"కుందేలు చెప్పినదే చేశాను," అన్నది ముసలిది. ఆమె నలుగురికీ వడ్డించింది. ముసలాడు కుందేలుకు చెప్పిన ప్రకారమే వంట సిద్ధం కావటం చూసి దొంగలు మోసపోయి, తమలో తాము గుసగుస లాడుకుని, ఆ కుందేలును అమ్మమన్నారు.

"కుందేలును అమ్మటమా? అది జరిగే పని కాదు!" అన్నాడు ముసలాడు. వాళ్ళు బేరం పదివేల మాడలకు పెంచినా ముసలాడు సరేననలేదు.

"వాళ్ళు అంతగా కావాలంటుంటే అమ్మరాదూ? డబ్బు కావాలని అంటూంటివిగా?" అన్నది ముసలిది.

"మన ఆవు మారినట్టు కుందేలు కూడా మారిపోతుందేమో?" అన్నాడు ముసలాడు తన భార్యతో.

దొంగలు ముగ్గురూ ఒకరికొకరు కన్ను మలిపి, "అలాటి భయం వద్దులే, ముసలాడా!" అన్నారు.

ముసలాడు పదివేల మాడలూ పుచ్చుకుని బుట్టతోబాటు తన రెండో కుందేలును వాళ్ళకు అమ్మేశాడు.

వాళ్ళు తమ గ్రామానికి తిరిగి వెళుతూ, "దీన్ని మన ఇళ్ళకు ముందుగా పంపి, మనకు ఏమేం వంటలు కావాలో మన పెళ్ళాలకు తెలియజేద్దాం," అనుకుని, ఒక్కొక్కడూ కుందేలుకు విడివిడిగా తమ అవసరాలు తెలిపి, కుందేలును వదిలేశారు. అది శరవేగంతో ఎటో వెళ్ళిపోయింది.

తరవాత ముగ్గురూ తమ తమ ఇళ్ళకు వెళ్ళి, కుందేలు రాలేదనీ, ముసలాడు తమను మోసం చేశాడనీ తెలుసుకున్నారు. వాళ్ళు ముగ్గురూ కలిసి ముసలాడి ఇంటికి వచ్చి, వాణ్ణి తిట్టనారంభించారు.

ముసలాడు ఓర్పుగా వాళ్ళ తిట్లన్నీ విని, "కుందేలును పంపేముందు దాన్ని ఒళ్ళంతా నిమిరారా?" అని అడిగాడు.

లేదని వాళ్ళు ఒప్పుకున్నారు.

"ఇంకేం? అది పిడికెడు గాలిగా మారి ఉంటుంది," అన్నాడు ముసలాడు.

"కుందేలు గాలిలో కలిసిపోవటమేమిటి? పిచ్చిగా మాట్లాడకు!" అన్నారు దొంగలు ముగ్గురూ.

"ఇంతపెద్ద ఆవు చిన్న మేకగా మారగా లేనిదీ, కుందేలు గాలిలో కలవటం విడ్డూరమా?" అని ముసలాడు అడిగాడు.

ముసలాడు తమ మీద పగతీర్చుకున్నాడని గ్రహించి దొంగలు వెళ్ళిపోయారు.





# బోళామనుషులు

ఒక గ్రామంలో కాపులందరూ వైష్ణవులు, చేతివృత్తుల వాళ్ళు శివభక్తులు. కాపులకు తమ పట్ల ఆదరం లేదని చేతివృత్తుల వాళ్ళ కొక అపోహ ఉండేది.

కాపుల పొగరు అణచాలని శివభక్తులు శివుణ్ణి పూజించారు. శివుడు ప్రత్యక్షమై, "మీ కోరిక ఏమిటి?" అని అడిగాడు.

"పరమేశ్వరా, ఈ గ్రామంలో కాపులకు మేమంటే ఏమాత్రమూ గౌరవం లేదు. తమ సంపద చూసుకుని వారు తెగ మిడిసి పడుతున్నారు. సకాలంలో వర్షాలు కురుస్తూ ఉండటంచేత పంటలు బాగా పండి, ఆ యేటికాయేడు వారి సంపద పెరిగిపోతూ ఉన్నది. దీని విషయం మీరు ఏదన్నా చెయ్యాలి," అన్నారు శివభక్తులు.

"సరే, నేను కళ్ళు మూసుకుని సమాధిలో వుంటాను. తిరిగి కళ్ళు తెరిచేదాకా వానలు ఉండవు," అన్నాడు శివుడు.

వెంటనే శివభక్తులు ఊరంతా తిరిగి, కాపులతో, "శివుడు కళ్ళు మూసుకున్నాడు. ఈ ఏడు వానలుండవు!" అన్నారు.

కాపులు తమ ఇష్టదైవమైన విష్ణుమూర్తిని పూజించారు. విష్ణువు ప్రత్యక్షమై, "ఏమిటి మీ కోరిక?" అన్నాడు.

అప్పుడు కాపులు విష్ణువుతో, "స్వామీ, శివభక్తులు మా మీద కక్షతో శివుడి కళ్ళు మూయించారు. ఆయనగారు కళ్ళు తెరిచేదాకా వానలు పడవు." అన్నారు.

"కొత్త కుండలు తెచ్చి, వాటిలో నీళ్ళు పోసి, వాటిలో కప్పలను వెయ్యండి. వానలు ఎలా కురవవో చూస్తాం," అని సలహాఇచ్చి విష్ణుమూర్తి అంతర్ధానమయాడు.

కాపులు విష్ణుమూర్తి చెప్పిన ప్రకారం కొత్త కుండలు కొని, వాటిలో నీళ్ళు పోసి, కప్పలను వేశారు. చల్లటి నీరు తగిలేసరికి కప్పలు బెకబెకమని అరవసాగాయి.

ఎం. వీరారెడ్డి

శివుడు కప్పల బెకబెక విని, "నేను వానలేకుండా చేశానుగదా, కప్పలకు నీళ్ళు ఎక్కడివి?" అని కళ్ళు తెరిచిచూశాడు.

శివుడు కళ్ళు తెరవగానే వర్షాలు ప్రారంభమయాయి. కాపులు పొలాలు దున్ని, నాట్లు వేశారు. శివభక్తులు మళ్ళీ పూజలు చేశారు. శివుడు ప్రత్యక్షమయాడు.

"పరమేశ్వరా, వర్షాలు కురిసి, కాపులు వ్యవసాయం ప్రారంభించారు. వాళ్ళ పొలాలు ఎప్పటికన్న కూడా పచ్చగా ఉన్నాయి. మునుపటికన్న ఈ ఏడు పంట మరింత హెచ్చుగా ఉండే లక్షణాలు కనబడుతున్నాయి," అన్నారు శివభక్తులు.

"ఇల్లు అలకగానే పండగ అయిందా? వాళ్ళు ఎంతపెద్ద కుప్ప వేసినా కుప్పకు పుట్టెడు ధాన్యమే రాలేటట్టు నేను చూస్తాను," అన్నాడు శివుడు.

వెంటనే శివభక్తులు ఊరిమీద పడి, "మీరు ఎంతపెద్ద కుప్ప వేసుకోండిగాక, కుప్పకు పుట్టెడు ధాన్యమే మీకు దక్కుడు," అని కాపులను ఎద్దేవా చేశారు.

అప్పుడు కాపులు మళ్ళీ విష్ణువును పూజించి, ప్రత్యక్షం చేసుకుని, "స్వామీ, మేము ఎంత కుప్ప వేసినా కుప్పకు పుట్టెడే గింజలు రాలేటట్టు శివభక్తులకు శివుడు హామీ ఇచ్చాడు. మా గతి ఏంకాను?" అని అడిగారు.

"ఎకరానికి పది కుప్పలు వెయ్యండి," అని సలహా ఇచ్చి విష్ణుమూర్తి అంతర్ధానమయాడు. కాపులు ఎకరానికి పది కుప్పలు వేసి, ఆ ఏడు ఎన్నడూ లేనంత పంట ఇళ్ళకు చేర్చుకున్నారు.

శివభక్తులు మరొకసారి శివుణ్ణి ప్రత్యక్షం చేసుకుని, "పరమేశ్వరా, ఈ ఏడు కాపులు ఎన్నడూ లేనంత ధనవంతులయారు," అని మొరపెట్టుకున్నారు.

"నేనేం చెయ్యను? మీ నోట మాట దాగదు. మీరు బోళా మనుషులు. నేను మీకు చెప్పినది మీరు మరుక్షణమే వాళ్ళతో చెప్పేస్తిరి. అందుకే నేను ఎంత సహాయం చేసినా మీకు లాభించలేదు," అని చెప్పి శివుడు అంతర్ధానమయాడు.





# యక్షపర్వతం

## 5

[ఖడ్గజాతి వాళ్ళు చెప్పిన మార్గం వెంట పోయి ఖడ్గ జీవదత్తులు బందిపోట్లను ఒక నదీ తీరం దగ్గిర కలుసుకున్నారు. రాత్రి బాగా పొద్దుపోయిన తర్వాత ఖడ్గ జీవదత్తులు వాళ్ళ పైకి దాడి పోబోయేంతలో, దాపుల నున్న ఒక కొండగుహలో నుంచి శరీరమంతా జడలు కప్పిన వికృతాకారు డొకడు బందిపోట్ల కేసి పరిగెత్తుకురాసాగాడు. తరవాత—]

నెగడు ముందు కూర్చుని తన అనుచరులతో కబుర్లాడుతున్న బందిపోట్లనాయకుడు గుహ వైపు నుంచి వచ్చిన వికృతమైన అరుపులూ, కేకలూ వింటూనే చప్పున తల తిప్పి అటు కేసి చూశాడు. అతడి దృష్టికి నిలువెత్తున వున్న నల్లని ఆకారం ఒకటి తమ కేసి పరిగెత్తుకు రాపటం కనిపించింది. ఆ ఆకారం చేతిలో భగ భగ మండుతున్న కాగడా ఒకటి వున్నది.

"ఏమిటీ భీతికొల్పే రూపం? ఏదైనా రాక్షసా, లేక కొండ పిశాచమా?" అంటూ బందిపోట్లనాయకుడు లేచి నిలబడ్డాడు.

"దొరా, యిక్కడ జాగు చేయటం ప్రాణాంతకం అవుతుంది. ఇదేదో మనుషుల్ని పీక్కుతినే రాక్షసే! సందేహం లేదు," అంటూ నెగడు ముందున్న బందిపోట్లనాయకుడి అనుచరులు నలుగురూ నదీ తీరం కేసి పరిగెత్తసాగారు.



"పిరికి వెధవల్లారా, ఆగండి! మనం యింతమందిమి వుండగా యీ రాక్షసి ఏం చెయ్యగలదు? ఈటెలు ఎత్తి గుంపుగా పోయి మీదపడి పొడుద్దాం, రండి," అంటూ బందిపోట్లనాయకుడు గావు కేకలు ప్రారంభించాడు.

అతడి అనుచరులెవరూ ఆ హెచ్చరిక వినిపించుకోకుండా బతికుంటే బలుసాకు తినవచ్చుననుకుంటూ తమ వాహనాలైన ఒంటెలు కట్టివేసి వున్న చెట్లకేసి కొందరూ, నది వైపుకు కొందరూ పారిపోసాగారు. ఈలోపల వికృతాకారం యింకా నిద్రపోతున్న కొందరు బందిపోట్ల మీద హఠాత్తుగా వచ్చిపడి, వాళ్ళను కాళ్ళతోతన్నుతూ, చేతిలోని కాగడాతో వాళ్ళు ధరించిన దుస్తులకు నిప్పుపెట్టి నానా భీభత్సమూ చేయసాగింది.

చెట్టు మీద వున్న ఖడ్గ జీవదత్తులు యీ భయంకర దృశ్యాన్ని చూసి ఒక క్షణ కాలం నిశ్చేష్టులై పోయారు. చెట్టు కింద వున్న ఖడ్గజాతి వాళ్ళు నలుగురూ ప్రాణ భయంతో గడగడ వణికిపోతున్నారు.

"ఖడ్గా, యీ వికృతాకారం రాక్షసీ కాదు, పిశాచమూ కాదు. ఆ గుహలో వున్న మాంత్రికుడు ఏవో మంత్రాలు వల్లించి, వాటి ద్వారా శివమెక్కించి పంపిన ఏదో శక్తి అయివుంటుంది," అన్నాడు జీవదత్తుడు.

"ఏమైతేనేం, మనం చేయాలనుకున్న పని ఆ మాంత్రికుడు చేస్తున్నాడు. మనం చూస్తూ వూరుకుందాం. బందిపోట్లంతా యీ ప్రాంతాల నుంచి పారిపోయింతరవాత జొన్నకంకుల గోతాంలో వున్న స్వర్ణాచారిని విడిపించుకుని, మన దారిన మనం పోదాం," అన్నాడు ఖడ్గవర్మ.

జీవదత్తుడు కొంచెంసేపు నదీ తీరంలో వికృతాకారుడు చేస్తున్న కల్లోలం కేసి చూసి, "బందిపోట్లనాయకుడు కొంత ధైర్య సాహసాలున్న వాడిలా కనిపిస్తున్నాడు. అటు చూడు! వాడు కొందరు అనుచరుల్ని కూడ గట్టుకుని వికృతాకారుణ్ణి వెనక వైపు నుంచి దెబ్బ తీసేందుకు పొంచి పొంచి ముందు నడుస్తున్నాడు," అన్నాడు.

జీవదత్తుడు చెప్పినట్టే బందిపోట్లనాయకుడు పారిపోతున్న పదీ పన్నెండు మంది అనుచరుల్ని ఈలె చూపి బెదిరించి ఆపి, వాళ్ళను వెంట బెట్టుకుని వికృతాకారుడి మీద హఠాత్తుగా వెనక నుంచి పడి దెబ్బ తీసేందుకు పోతున్నాడు.

"ఈ దెబ్బతో గుహలోని మాంత్రికుడూ వాడు సృష్టించిన మహాశక్తీ హఠాన్మరణం పాలవుతాయి. ఆ వికృతాకారుణ్ణి చంపిన తరవాత, బందిపోట్లనాయకుడు కొండగుహలన్నీ గాలించి ఆ మాంత్రికుణ్ణి కూడా హతమారుస్తాడు. మనం ఏదో ఒకటి చేయాలి. స్వర్ణాచారి యీ గొడవలో ఏ ఒంటెల కాళ్ల కిందో పడి చావకుండా చూడాలి," అన్నాడు ఖడ్గవర్మ.

ఖడ్గవర్మ మాట ముగించే లోపలే మాంత్రికుడున్న కొండ గుహ మధ్య పెద్ద మంట లేచింది. మాంత్రికుడు ఆ మంటలో బాగా నూనెతో తడిపి వుంచిన కాగడాలను ఒక్కొక్కదాన్నే ముట్టించి, "శాంభవీ! భైరవీ!" అని అరుస్తూ, దిగువ నున్న బందిపోట్ల మీదికి విసరసాగాడు.

భగభగమని మండుతున్న కాగడాలు బందిపోట్ల మీదికి వచ్చి పడసాగాయి. ఈ కొత్త దాడిని చూస్తూనే బందిపోట్లనాయకుడు అదిరిపడి, తన అనుచరులతో, "ఒరే, ఉష్ట్రవీరుల్లారా! ఈ కనబడే వికృతి పిశాచం




లాంటివి, ఆ పైనున్న కొండ గుహలో మరి కొన్ని వున్నట్టుంది. ఇక లాభం లేదు. మీలో కొందరు జొన్నకంకులున్న గోతాలను నదిలోకి తోయండి. నది వాలు వెంట తేలి వచ్చే వాటిని, దిగువ నెక్కడైనా పట్టుకుని ఒడ్డుకు చేర్చుదాం. మిగిలిన వాళ్ళు చెట్ల నుంచి ఒంటెలను విప్పి సవారీ అయి నది దిగువకు బయలుదేరండి," అని కేక పెట్టాడు.

ఆ కేక వింటూనే నది కేసి పరిగెత్తి పోతున్న బందిపోట్లూ, చెట్ల చాటున చీకట్లో దాక్కున్న వాళ్ళూ ముందుకు వచ్చి, కొందరు ఒంటెలను చెట్ల నుంచి విప్పనారంభించారు. మరి కొందరు జొన్నకంకు



లున్న గోతాలను ఎత్తుకుని నదిలో వేసేందుకు బయలుదేరారు. ఇంతలో గుహలో వున్న మాంత్రికుడు ఒక చేతితో కాగడా పట్టుకుని అటూ యిటూ ఊపుతూ, "ఒరే, జడలభూతం! ఇక ఆ బందిపోటు నరాధముల్ని వెంట తగిలి, జొన్నకంకుల గోతాముల్ని నదిలో వేసేవాళ్ళను పట్టుకుని, నదీభూతానికి ఆహారంగా వెయ్యి," అని కేక వేశాడు.

అప్పటివరకూ దొరికిన బందిపోటు నల్లా కాళ్ళతో, చేతుల్తో ఎడా పెడా బాదుతూ ఆ ప్రదేశాన్నంతా అల్లకల్లోల పరుస్తున్న వికృతాకారుడు, మాంత్రికుడి హెచ్చరిక వింటూనే జొన్నకంకుల గోతాలున్న ప్రాంతానికి పరిగెత్తాడు. ఆ సరికే కొందరు బందిపోట్లు గోతాలను భుజాల కెత్తుకుని నది కేసి పరిగెత్తుతున్నారు. వికృతాకారుడు వాళ్ళల్లో దొరికిన వాడినల్లా నడుం పట్టుకుని నదిలోకి విసిరివేయసాగాడు.

ఈసారి నదీ తీరాన మరింత అల్లకల్లోలం లేచింది. బెదిరి కట్టు తాళ్ళను తెగ కొట్టిన ఒంటెలు కొన్ని గుడ్డి చీకట్లో దారీ తెన్నూ లేకుండా పరుగులు తీస్తూ, బందిపోట్లను కాళ్ళతో తన్ని, అందిన వాళ్ళను నోటితో పట్టుకుని దూరంగా విదిలించి వేయసాగినై. వాటిల్లో కొన్ని చెవులు చిల్లులు పడేలా కీచుమని అరుస్తూ నదీ ప్రవాహంలోకి పోయి పడి, నీటి వాలు వెంట కొట్టుకు పోసాగినై.

ఆ సమయంలో హఠాత్తుగా ఒక మానవ కంఠం, "రక్షించండి! రక్షించండి! నన్ను నదిలో పడవెయ్యకండి!" అంటూ గగ్గోలు ప్రారంభించింది. అంతలోనే దభీమంటూ ఒక జొన్నకంకుల గోతాం నీట పడిన శబ్దం అయింది.

"ఖడ్గా, ఆ కంఠస్వరాన్ని పోల్చుకున్నావా? ఆ కేకలు పెట్టినవాడు స్వర్ణాచారి. అతణ్ణి బందిపోట్లు నదిలో పారవేశారు. జొన్నకంకుల గోతాం నీట మునగదు కనక, అందులో గొంతు వరకూ కుక్కబడి వున్న స్వర్ణాచారి నీటి వాలున కొట్టుకుపోయి, ఎక్కడో ఒక చోట నది

ఒడ్డుకు చేరే అవకాశం వుంది. కాని, మనం ఒక పొరబాటు చేశాం. కొంచెం ముందుగా పూనుకున్నట్టయితే అతణ్ణి యిక్కడే రక్షించి వుండేవాళ్ళం," అన్నాడు జీవదత్తుడు చెట్టు మీదినుంచి దిగబోతూ.

ఖడ్గవర్మ అతడి భుజం పట్టుకు ఆపి, "ఇప్పుడు ఏం చేయబోతున్నావ్?" అని అడిగాడు.

"ఖడ్గజాతి వాళ్ళల్లో ఒకణ్ణి నదీ తీరం వెంట దిగువకు పొమ్మని చెబుతాను. బహుశా వాడికి స్వర్ణాచారి కేకలు వినబడే అవకాశం వుంది. తతిమ్మా ముగ్గుర్నీ ఖడ్గ మృగా లెక్కపోయి, అందిన బందిపోటు నల్లా ఈటెకు బలిపెట్టమంటాను," అన్నాడు జీవదత్తుడు.

"అయితే మనం యిక్కడ చేతులు కట్టుకుని యీ వింత చూస్తూ కూర్చోవట మేనా?" అన్నాడు ఖడ్గవర్మ కొంచెం కోపంగా.

"తొందరపడకు, ఖడ్గా! బందిపోట్లు యిప్పటికే చెల్లాచెదురుగా అటూ యిటూ పరిగెత్తుతున్నారు. కాని, వాళ్ళ నాయకుడు యింకా తాను దొంగిలించుకు వచ్చిన జొన్న పంటను కాపాడుకునే ప్రయత్నంలో జడల భూతాన్ని ఎదిరించే ప్రయత్నం చేస్తున్నాడు. వాడు తన అనుచరులకు చేస్తున్న హెచ్చరి కలు నీకు వినబడటం లేదా? మన ఖడ్గ



జాతి వాళ్ళకు వాడు దొరక్కుండా తప్పించు కునే ప్రయత్నం చేస్తే, అప్పుడు వాణ్ణి మనం బాణాలతో కొట్టి హతమార్చాలి. ముందు యీ జడలభూతం, మాంత్రికుడీ సంగతేమిటో మనం చూడాలిగదా?" అన్నాడు జీవదత్తుడు.

"బావుంది. నువు ఖడ్గజాతి వాళ్ళకు చెప్పవలసిందేదో చెప్పి రా. నే నిక్కడే వుంటాను," అని ఖడ్గవర్మ విల్లంబులు చేతికి తీసుకున్నాడు.

జీవదత్తుడు చెట్టు దిగి పోయి ఖడ్గజాతి వాళ్ళకు వాళ్ళు చేయువలసిన పనుల సంగతి చెప్పాడు. ఆ వెంటనే ఒక ఖడ్గ జాతివాడు ఖడ్గమృగాన్నెక్కి నది దిగువకు




బయలుదేరాడు. కాని, మిగిలిన ముగ్గురు ఖడ్గజాతివాళ్ళూ కాసేపు తటపటాయించి, "దొరా, యీ బందిపోట్లన్నా, వాళ్ళ వింత మృగాలైన ఆ ఒంటెలన్నా మాకు భయం పోయింది. కాని, ఆ జడల భూతం మాటేమిటి? అది మమ్మల్ని నిలువునా విరుచుకు తినదా?" అన్నారు.

"ఆ భూతం సంగతీ, దాన్ని బందిపోట్ల మీదికి ఉసికొల్పినవాడి సంగతీ మేం చూస్తాం. మీరు మాత్రం అందిన బంది పోటునల్లా మీ ఈటెలకు బలిపెట్టండి. వాళ్ళు నోటికి అక్కరకు వచ్చిన మీ జొన్న పంట అంతా కోసుకుపోయారు. ఆ సంగతి బాగా గుర్తుంచుకోండి," అన్నాడు జీవదత్తుడు.

తమ పంటపొలాల మాట వింటూనే ఖడ్గజాతి వాళ్ళు కోపంతో గట్టిగా పళ్ళు కొరికి, "దొరా, యీ దుర్మార్గుల్ని మేం ప్రాణాలతో పోనియ్యం!" అంటూ తమ వాహనాలెక్కి, "జై, అరణ్యమాతా!" అంటూ బందిపోట్ల కేసి దూకారు.

జడలభూతం ధాటికే తట్టుకోలేక చెల్లా చెదురై తమ నాయకుడి హెచ్చరికలవల్ల తిరిగి అక్కడక్కడా గుంపుగూడుతున్న బందిపోట్లు, ఖడ్గమృగాల మీద వస్తున్న వాళ్ళను చూస్తూనే గుండెలవిసి, "ఖడ్గ జాతి వాళ్ళ మంద వచ్చి మీద పడు తున్నది, దొరా! యిక లాభం లేదు. పారి పోదాం!" అంటూ కాలిసత్తువ కొద్దీ చెట్ల కేసీ, నది ఒడ్డు వెంటా పరిగెత్తసాగారు.

ఈ కొత్త దాడిని చూస్తూనే బందిపోటు నాయకుడికూడా తారెత్తిపోయింది. ఒక వైపున జడల భూతం! రెండవ వైపున ఈటెలెత్తి వస్తున్న ఖడ్గజాతి వాళ్ళు! ఇక అక్కడ నిలబడి లాభంలేదనుకుని అతడు పెద్దగా గొంతెత్తి, "అందరూ నది ఒడ్డు వెంట దిగువకు పరిగెత్తండి. మనం నదిలో వేసిన జొన్నకంకుల మూటలను ఎక్కడో ఒక చోట ఒడ్డుకు చేర్చాలి," అంటూ పరిగెత్తసాగాడు.

"ఆహాఁ, తెలివి తక్కువ కొద్దీ ఆలశ్యం చేశాను. దుర్మార్గుడు ప్రాణాలతో తప్పిం

చుకు పోయేట్టున్నాడు," అంటూ చెట్టు మీద వున్న ఖడ్గవర్మ బందిపోటు నాయకుడి కేసి బాణం వెంట బాణం వదిలాడు. కాని, ఆ సరికే వాడు బతికి వున్న తన అనుచరులతో పాటు ఖడ్గవర్మ బాణం వేటుకు అందనంత దూరం పరిగెత్తి పోయాడు.

బందిపోట్ల మీదికి పోయిన ఖడ్గజాతి వాళ్ళు ఇద్దరు ముగ్గురు బందిపోట్లను మాత్రం తమ ఈటెలతో పొడవగలిగారు. అంతలో ఆ దుర్మార్గులందరూ తమ నాయకుడి ఆజ్ఞ విని మూక ఉమ్మడిగా అక్కణ్ణించి పారిపోయారు. ఇప్పుడా ప్రదేశమంతా పెద్ద జడివాన హఠాత్తుగా ఆగిపోయినట్టు ఒక్క క్షణకాలం నిశ్శబ్దమై పోయింది.

గుహలో వున్న మాంత్రికుడు గుహ ముందుకు వచ్చి కాగడాను పైకెత్తి పట్టుకుని తల అటూ యిటూ తిప్పిచూస్తూ, "ఒరే, జడల భూతం! నువ్వెక్కడ? జొన్నగింజల మూటలు కొన్నయినా మన చేత బడినయ్యా?" అని కేకవేశాడు.

జడలభూతం పెద్ద పెద్ద అంగలు వేసుకుంటూ నదీ తీరం నుంచి గుహకేసి బయలుదేరేంతలో దాని దృష్టి ఖడ్గజాతి వాళ్ళ మీద పడింది. వెంటనే అది భీతి గొన్నట్టు కీచుమనే కంఠస్వరంతో, "యమ కింకరులు! ఒంటి కొమ్ము మహిషాలెక్కి వచ్చారు!" అని కేక పెట్టింది.

ఆ కేక వింటూనే మాంత్రికుడు గుహలోంచి మరి కాస్త ముందుకు వచ్చి కాగడా



వెలుగులో ఖడ్గమృగాలనూ, వాటిని ఎక్కి వున్న వాళ్ళనూ చూసి, ఒక్కక్షణం నివ్వెర పోయి, అంతలోనే తేరుకుని, ''ఒరే, జడల భూతం! వాళ్ళు యమకింకరులూ కాదు, అవి ఒంటికొమ్ము మహిషాలూ కావు. ఖడ్గ జాతివాళ్ళూ, ఖడ్గమృగాలూ! తెలిసిందా? వెళ్ళి మీదపడి, ముందు మనుషుల్ని విరుచుకుతిను. తరవాత మృగాలను తిందువు గాని,'' అన్నాడు.

మాంత్రికుడు యిలా అనగానే జడల భూతం ఒక వికటాట్టహాసం చేసి, "అహహ్హాఁ, పారిపోకండి!" అంటూ చేతులుచాచి ఖడ్గ జాతివాళ్ళ కేసి బయలుదేరింది.

ఆ భూతం మీదికి రావటం చూస్తూనే ఖడ్గజాతి వాళ్ళు ముగ్గురూ, "దొరా!" అంటూ చావుకేక పెట్టారు.

ఖడ్గజాతి వాళ్ళకు రానున్న ప్రమాదాన్ని గుర్తించిన ఖడ్గజీవదత్తులు అంతకు ముందే చెట్టు దిగి వాళ్ళున్న చోటుకు పరుగు పరుగున వస్తున్నారు. ఖడ్గజాతి వాళ్ళ ఆక్రందనం వింటూనే ఖడ్గవర్మ ఒక బాణాన్ని గురిచూసి జడలభూతాని కేసి వదిలాడు. అది పోయి భూతాన్ని తాకింది. కాని, దాని శరీరం మీద ఒత్తుగా వున్న జడలవల్ల భూతం ఏ మాత్రం గాయపడలేదు.

"గురూ! ఎవడో నా మీద దూరాన్నుంచే కొయ్యములికి కొట్టాడు," అంటూ కేక పెట్టింది భూతం.

మాంత్రికుడు నిర్ఘాంతపోతూ, యీ సారి రెండు చేతులతో రెండు కాగడాలు పట్టుకుని పైకెత్తి, వాటి వెలుగులో ముందుకు పరిగెత్తుకొస్తున్న, ఖడ్గజీవదత్తులను చూసి, కళ్ళెర్రచేసి, పళ్ళు కొరుకుతూ, "ఒరే, జడల భూతం! నీ శరీరాన్ని తాకింది కొయ్యములికి కాదు, బాణం! ఆ కొట్టిన వాడు క్షత్రియుడిలా వున్నాడు. వెంట వున్న రెండవవాడు సగం క్షత్రియుడూ, సగం మంత్రవేత్తలా వున్నాడు. ఆగు, నా మంత్రదండాన్ని విసిరి యిద్దర్నీ యిప్పుడే చితా భస్మంగా మార్చిపారేస్తాను!" అంటూ ఎగిరి గంతేసి గుహ లోపలికి వెళ్ళాడు. —(ఇంకావుంది)






# దొంగకు సన్మానం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవం లోని బేతాళుడు, "రాజా, నువు శ్రమపడు తున్నది సజ్జనుల కోసమా, దుర్జనుల కోసమా అని నాకు సందేహంగా ఉన్నది. కొందరు రాజులు చంద్రసేన మహారాజు లాగా శిక్షించదగిన వారికి సన్మానం చేస్తారు. నీకు శ్రమ తెలియకుండా ఉండగలందు లకు చంద్రసేన మహారాజు కథ చెబు తాను, విను," అంటూ ఇలా చెప్పసాగాడు :

ఒకప్పుడు చంద్రావతీ నగరాన్ని చంద్ర సేన మహారాజు పాలించేవాడు. ఆయన దేశంలో కోటికి పడగెత్తిన వర్తకశ్రేష్ఠులు అనేకమంది ఉండేవారు. కాని దేశం సుభిక్ష మైనది కాదు. జనం హెచ్చు భాగం దరి ద్రులు. నిజానికి ఆ దేశపు సంపద వర్త

## బేతాళ కథలు



కులు మాత్రమే. అందుచేత రాజు అధికంగా వర్తకులపై ఆధారపడి పరిపాలన చేసేవాడు. వారి సౌకర్యాలు చూడటమే ఆయన ప్రథమ కర్తవ్యం. రాజు అండన బికారులు కూడా వర్తకం చేసి ధనికులవుతున్నారు.

అయితే చంద్రావతీ నగరపు వర్తక శ్రేష్ఠులకు అనుకోని బెడద ఒకటి వచ్చి పడింది. ఆ నగరంలోనే ఒక గజదొంగ వెలిశాడు. వాడు దొంగతనాలు చెప్పిచేసేవాడు. ముందుగా ధనికుణ్ణి హెచ్చరించకుండా వాడు ఒక్క దొంగతనమూ చెయ్యలేదు. అయినా ఆ గజదొంగను పట్టటం ఎవరికీ సాధ్యం కాలేదు. దానికి కారణమేమంటే ఆ గజదొంగ ఒంటరిగాడు. దొంగతనాలలో వాడికి తోడు ఎవరూ ఉండేవారు కారు. వాణ్ణి చూసినవారు లేరు, అందుచేత గుర్తు పట్టగలవారూ లేరు.

ఇంతేగాక, వాడు తాను దొంగిలించిన అపారధనాన్ని దాచుకోక, వెంటనే బీదవాళ్ళకు పంచేసేవాడు. వాడి వల్ల ధనసహాయం పొందిన వాళ్ళు సైతం వాణ్ణి చూడలేదు.

ఈ గజదొంగ నుంచి తమను తాము కాపాడుకోలేక, వాణ్ణి పట్టటానికి తాము చేసిన ప్రయత్నాలన్నీ వ్యర్థంకాగా, వర్తక శ్రేష్ఠులంతా కలిసి రాజుగారి వద్దకు వెళ్ళి, "మహారాజా, ఈ గజదొంగ విషయంలో మీరు చూస్తూ ఊరుకోవటం భావ్యం కాదు. వీడి బారినుంచి మమ్మల్ని కాపాడే బాధ్యత తమ మీద ఉన్నది," అని హెచ్చరించారు.

"భటులను గస్తీ తిప్పుతున్నాను. దొంగను పట్టటానికి నాకు చేతనైన ఏర్పాట్లన్నీ అదివరికే చేశాను. ఎప్పుడో వాడు తప్పటడుగు వేసి మనకు దొరికిపోతాడు," అన్నాడు రాజు.

"అది జరిగే లోపల మేమంతా బికార్లమైపోతాము. అందుచేత మీరు దొంగను పట్టిన వాడికి పదివేల రూపాయలు ఇస్తామని చాటింపు వేయించండి. వాడి సన్నిహితుడు ఎవడో ఒకడు వాణ్ణి పట్టియిస్తాడు.

కావలిస్తే ఆ పదివేలూ మేమే ఇచ్చుకుంటాం," అన్నారు వర్తకశ్రేష్ఠులు.

రాజు వారు చెప్పినట్టే చాటింపు వేయించాడు. కాని అందువల్ల ప్రయోజనం ఏమీ లేకపోయింది. దొంగను ఎవరూ పట్టి యివ్వలేదు. వాడు దొంగతనాలు చేస్తూనే ఉన్నాడు.

ఇంతకూ ఈ గజదొంగ గంగడు అనే ఒక పేదవాడు. వాడికి దొంగతనం తప్ప ఇంకే వృత్తివిద్యా రాదు. అనేక వృత్తుల వాళ్ళు పస్తులుండటం వాడు చూశాడు. తానూ, తనలాటి వాళ్ళూ ఇంత తినటానికి గాను వాడు తన చోరవిద్యను ఉపయోగించసాగాడు.

ఒకరోజు వాడు నగరం విడిచి అడవి దాటి ఒక కొండ గ్రామానికి వెళ్ళి తిరిగి వస్తున్నాడు. వాడు అడవిలో నడుస్తూ ఉండగానే బాగా చీకటి పడిపోయింది. త్వరగా ఇంటికి చేరాలని వాడు వేగంగా నడుస్తూ ఉండగా ఒక వైపునుంచి మనిషి మూలుగు వినిపించింది.

గంగడు అటుగా వెళ్ళి, పొదల మధ్యన గాయాలతో పడి ఉన్న ఒక మనిషిని చూశాడు. "ఏం జరిగింది? ఎవరు నువు?" అని గంగడు ఆ మనిషిని అడిగాడు.

"నా పేరు రామదత్తుడు. మాది రాజగిరి. వర్తకం చేసుకుందామని చంద్రావతికి వస్తూ



ఒక ఎలుగుబంటి వాత పడ్డాను. ఇంకా నయం, అది నన్ను ప్రాణాలతో వదిలింది. నువ్వెవరు?" అని అడిగాడు ఆ మనిషి బాధపడుతూనే.

గంగడు తన అసలు పేరు దాచిపెట్టి, "నా పేరు ధర్మన్న. పేదవాణ్ణి," అన్నాడు.

వాడు రామదత్తుణ్ణి ఎత్తుకుని తన యింటికి తెచ్చి, అతని గాయాలకు మందులు పూసి, తిండి పెట్టి, ఉపచారాలు చేస్తూ వచ్చాడు.

తనను కాపాడిన మనిషి అప్పుడప్పుడూ రాత్రి పూట ఎక్కడికో వెళ్ళి వస్తూండటం చూసి రామదత్తుడు, "రాత్రివేళ ఎక్కడికి పోతావు?" అని అడిగేవాడు.



గంగడు రామదత్తుడికి ఏవో అబద్ధాలు కల్పించి చెప్పేవాడు.

రామదత్తుడి గాయాలు మానటానికి చాలా కాలం పట్టింది. ఈలోపల ఇద్దరూ మంచి మిత్రులయారు.

రామదత్తుడు ఒకనాడు గంగణ్ణి, "నీది ఏం వృత్తి? ఎట్లా బతుకుతున్నావు?" అని నిర్బంధించి అడిగాడు.

రామదత్తుడి మీద పూర్తి విశ్వాసం ఏర్పడటం వల్ల గంగడు తన సంగతి అంతా చెప్పేశాడు.

గంగడు గజదొంగ అని తెలియగానే రామదత్తుడికి వాడిపట్ల గల స్నేహ భావం పూర్తిగా పోయింది. గంగణ్ణి పట్టి ఇచ్చిన వారికి పదివేల రూపాయలు బహుమానం ఇస్తారని తెలిసి, ఆ బహుమానం తాను సంపాదించాలనీ, ఆ పెట్టుబడితో లక్షలు సంపాదించవచ్చుననీ అతనికి ఆశపుట్టింది.

అందుచేత, గంగడు పొరుగూరు వెళ్ళిన రోజున రామదత్తుడు వెళ్ళి రాజుగారి దర్శనం చేసుకుని తాను గజదొంగను పట్టి యిస్తాననీ, తనకు బహుమానం ఇప్పించవలసిందనీ అన్నాడు.

"ఏదో వంక పెట్టి దొంగను రేపు అపరాహ్ణం వేళ రాజభవనం దగ్గిరికి తీసుకురా. మా భటులు వాణ్ణి పట్టుకుంటారు." అన్నాడు రాజు.

రామదత్తుడు పరమానందభరితుడై ఇంటికి తిరిగి వచ్చాడు. గంగడు రాగానే అతను వాడితో, "మిత్రమా, ఇంతవరకూ నేను నగరం ఎలా ఉంటుందో చూడలేదు. రేపు నాకు ఊరంతా చూపిస్తావా?" అని అడిగాడు. అందుకు గంగడు సరేనన్నాడు. వాడికి రామదత్తుణ్ణి గురించి ఎలాటి అనుమానమూ లేదు.

ఇద్దరూ తిండి మూటగట్టుకుని మర్నాడు ఉదయం నగరం చూడటానికి బయలుదేరారు. మధ్యాహ్నం వేళకు వాళ్ళు రాజభవనం సమీపంలో ఉన్న ఒక కోనేరు వద్ద చెట్ల నీడన కూర్చుని తమ భోజనం మూటలు విప్పారు. ఆ సమయంలో ఎక్కడి

నుంచో ఒక కుక్క తోక ఆడించుకుంటూ వచ్చింది. రామదత్తుడు దాన్ని కసిరి కొట్టాడు. కాని, గంగడు దానికి రొట్టెముక్క తుంచి వేశాడు.

తిండి తినటం ముగిసినాక రామదత్తుడు గంగడితో, "రాజభవన ద్వారం దగ్గిరికి పోదాం," అన్నాడు.

ఇద్దరూ బయలుదేరారు. కుక్క గంగడి వెంటనే వచ్చింది. వాళ్ళు రాజభవనానికి ఎదురుగా వచ్చారు. ద్వారం వద్ద ఉండే భటుల కేసి రామదత్తుడు చూశాడు. వాళ్ళు గంగణ్ణి పట్టుకునే ప్రయత్నం ఏమీ చెయ్యలేదు.



అప్పుడు రామదత్తుడు గంగడి కేసి తిరిగి, రాజభటులకు వినిపించేలాగా, "నువు దొరికి పోయావు! ఇప్పుడెలా తప్పించు కుంటావు?" అని కేక పెట్టాడు.

వాడి ద్రోహబుద్ధి చూసి గంగడికి రక్తం ఉడికి పోయింది. అలాటి కృతఘ్నుణ్ణి బతికి ఉండనివ్వరాదని గంగడు కత్తి దూశాడు. అయితే, ముందే సిద్ధంగా ఉన్న రామదత్తుడు గంగడి మీదికి బాకు విసిరాడు. గంగడి వెంట ఉన్న కుక్క ఎగిరి బాకుకు అడ్డం వచ్చింది. బాకు దాని డొక్కలో గుచ్చుకుని అది చనిపోయింది.

మరుక్షణమే గంగడు రామదత్తుడి తల నరికేశాడు.

అప్పుడు రాజభటులు ముందుకు వచ్చి గంగణ్ణి పట్టుకున్నారు.

గంగడు రామదత్తుడి శవాన్ని కాలితో తన్ని, "నీ కన్న ఊరకుక్క నయం గదరా!" అని, రాజభటుల వెంట రాజు గారి వద్దకు వెళ్ళాడు. రాజుగారు చాలా సేపు గంగడితో ఏకాంతంగా మాట్లాడాడు.

మర్నాటి సభకు రాజు వర్తకశ్రేష్ఠుల నందరినీ పిలిపించి, వారికి గంగణ్ణి చూపి, "ఈ పేదవాడు మన రాజ్యానికి మహోపకారం చేశాడు. ఇక మీకు దొంగల భయం ఉండదు. మీ రందరూ తలా ఒక పది వేలూ ఇతనికి ఇచ్చినా ఇతని రుణం తీరదు," అన్నాడు.

వర్తకులు అలాగే చేశారు. తరవాత గంగడు రాజుగారి ఆంతరంగిక సలహాదారుగా ఉండిపోయాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, చంద్రసేనమహారాజు ప్రవర్తనకు అర్థం ఏమిటి? ఆయన భటులు గంగణ్ణి చూస్తూనే ఎందుకు పట్టుకోలేదు? దొరికినాక అయినా ఆయన గంగణ్ణి శిక్షించక వర్తకుల చేత వాడికి బహుమానాలిప్పించి, తన సలహాదారుగా ఎందుకు వేసుకున్నాడు? తానే గజదొంగను చంపినట్టు గంగడు రాజు దగ్గిర అబద్ధం చెప్పాడా? ఆ క్రితం రోజు రామదత్తుణ్ణి రాజు చూసి ఉన్నాడు గద? గంగడు రామదత్తుడు కాడని రాజు పోల్చుకోలేకపోయాడా? వీటన్నిటికీ సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "రాజుకు గజదొంగ వల్ల నష్టం కలిగినట్టు కనబడదు. ఆయన వర్తకుల చేతి కీలుబొమ్మ. వాళ్ళ నష్టం అతన్ని బాధించదు. అందుచేత గజదొంగను పట్టుకోవటం గురించి రాజుకు అదుర్దా లేకపోయి ఉండవచ్చు. పైన పేద జనాన్ని ఆదుకోవటం రాజుకు చేతగానప్పుడు ఆ పని దొంగే చేస్తూ వచ్చాడు. ఆ విధంగా దొంగ రాజప్రతినిధి అనవచ్చు. దొంగను పట్టి యిస్తానని వచ్చిన వాడు నమ్మకద్రోహి కాక తప్పదు. అందుచేత వాడి సంగతి దొంగనే తేల్చనిచ్చాడు రాజు. గంగడు రాజుతో నిజమే చెప్పి ఉంటాడు. అబద్ధం ఆడి పదివేలు పుచ్చుకోవాలన్న ధనాశ వాడిలో లేదు. కనకనే వాణ్ణి రాజు శిక్షించలేదు. వాడికి వర్తకుల చేత ఇప్పించిన సొమ్ము పేద ప్రజలకు చేరుతుందని రాజుకు తెలుసు. వాణ్ణి రాజు తన సలహాదారుగా వేసుకున్నది నగరంలోని వర్తకశ్రేష్ఠుల రహస్యాలు తెలుసుకుని వారి పట్టు నుంచి కొంతవరకైనా బయట పడటానికి అయి ఉండవచ్చు." అన్నాడు. రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. (కల్పితం)



# ఔదార్యం ఖరీదు

ఒక గ్రామంలో ఒక ఆసామికి నాలుగు అవులు ఉండేవి. వాటిని కాయటానికి ఒక పాలేరు ఉండేవాడు.

ఆ ఆసామికి తాను గొప్ప ఉదారుడని పేరు తెచ్చుకోవాలన్న కోరిక కలిగింది. అందుకుగాను ఆయనకు ఒక ఉపాయం కూడా తట్టింది. ఆయన తన నౌకర్లకు ఇద్దరికి దొంగలలాగా వేషాలు వేయించి, తన పాలేరు అవులను తోలుకుని ఇంటికి వచ్చేటప్పుడు ఒక అవును దొంగిలించమన్నాడు. వాళ్ళు అలాగే చేశారు.

పాలేరు మూడు అవులతో ఇంటికి తిరిగి వచ్చి, ఏడుస్తూ జరిగిన సంగతి చెప్పాడు.

"నువు మాత్రం ఏం చెయ్యగలవు లేరా! విచారించకు!" అన్నాడు యజమాని. పాలేరు ఆశ్చర్యపోయాడు. ఊళ్ళోవాళ్ళు ఆయన మంచితనం మెచ్చుకున్నారు.

తరవాత మరో రెండు అవులు ఇలాగే పోయాయి. అప్పుడు కూడా ఆయన పాలేరును పల్లెత్తుమాట అనలేదు. ఆయన ఖ్యాతి చుట్టుపట్ల గ్రామాలకు పాకింది.

చివరకు ఒకనాడు పాలేరు ఒంటరిగా ఇంటికి వచ్చి, నాలుగో అవును కూడా దొంగ లెత్తుకుపోయారని చెప్పి, పనిమానుకుని వెళ్ళిపోయాడు.

తాను నాలుగో అవును దొంగిలించమని తన మనుషులకు చెప్పకపోవటం చేత ఆసామి ఆశ్చర్యపోయాడు. మూడు అవులు పోతే మాట్లాడలేదు గదా అని పాలేరే నాలుగో అవును కాజేశాడు. ఆ సంగతి ఆసామి ఎరగడు.

—వి. గిరిజ






# నేరానికి శిక్ష

ఒకప్పుడు పాంచాల దేశాన్ని విజయసింహుడు అనే రాజు పాలించాడు. ఆయనది రామరాజ్యం అని పేరు తెచ్చుకున్నది. ఆయనకు ప్రజలపట్ల దయ ఇంతా అంతా కాదు. అయితే విజయసింహుడికి సంతానం లేదు. అనేక వ్రతాలూ, నోములూ ఫలించకపోయేసరికి విజయసింహుడు తన భార్యతో సహా తీర్థయాత్రలు చేసి రావాలనుకున్నాడు. అందుకని ఆయన తన తమ్ముడైన జయసింహుడికి రాజ్యభారం అప్పగించి, తాను తీర్థయాత్రలకు బయలుదేరాడు.

జయసింహుడు మొదటినుంచీ భోగలాలసుడు. అన్న స్థానంలో తాను రాజు అయాక అతనికి అధికారంలో ఉండే ఆనందం కూడా తెలిసి వచ్చింది. పరిపాలన చూడటానికి సమర్థులైన మంత్రులున్నారు. రాజ్యాన్ని రక్షించటానికి సమర్థులైన దండనాయకులున్నారు. జయసింహుడికి రోజులు క్షణాలలాగా గడిచిపోయాయి.

తన వైభవమంతా అన్న తిరిగి వచ్చేదాకానేగదా అన్న ఆలోచన వచ్చినప్పుడు జయసింహుడికి బాధ కలిగేది. ఏ కారణం చేతనైనా అన్న తిరిగి రాకపోతే, అన్నకు సంతానంలేదు గనక, ఈ రాజ్యం తనదే గదా అన్న ఆశ కలిగేది. కొన్ని నెలలు ఇలా గడిచాయి.

ఇంతలో విజయసింహుడు తిరిగి వస్తున్నట్టు వార్త వచ్చింది. రాజధానిలో ప్రజలంతా సంతోషించారు. ఒక్క జయసింహుడే నిరాశలో మునిగిపోయాడు. పైకి అతను కూడా అందరితోబాటు సంతోషం నటించాడు.

ఆ రాత్రి అతను తనకు విశ్వాసపాత్రుడైన దండనాయకుణ్ణి తన మందిరానికి పిలిపించి, ఆ రాత్రి తన అన్ననూ, వదినెనూ

నందా వెంకటరమణ

వారు మజిలీ చేసిన చోట హత్యచేయించ టానికి ఆలోచనలు చేశాడు. వారిద్దరూ మాట్లాడుకుంటూ ఉండగా జయసింహుడి భార్య రూపమతి వారి సంభాషణ అంతా విన్నది.

విజయసింహుడు తన భార్యతో సహా హతుడైనట్టు మర్నాడు రాజధానికి వార్త వచ్చింది. నగరమంతా దుఃఖ సముద్రంలో మునిగిపోయింది. అందరితోబాటు జయ సింహుడు కూడా దుఃఖించాడు. ఈసారి అతని దుఃఖం నటన కాదు. రాజ్యం కోసం అన్నను హత్య చేయించాడే గాని, అన్నమీద అతనికి ప్రేమ లేకపోలేదు.

జయసింహుడు తన అన్నకూ, వదినెకూ దహన సంస్కారాలూ, ఉత్తరక్రియలూ యథావిధిగా జరిపి, లాంఛనంగా రాజ్యాభి షేకం చేయించుకున్నాడు.

చిత్రమేమిటంటే తాను నిజంగానే రాజు అయేసరికి జయసింహుడికి అధికార వ్యామోహం పూర్తిగా పోయింది. ప్రజల క్షేమం చూడటంలో తాను తన అన్నకు ఏమాత్రమూ తీసిపోడని పేరు తెచ్చుకోవ టానికి అతను అహర్నిశలు కృషిచేశాడు. ప్రజలు త్వరలోనే విజయసింహుణ్ణి మరిచి పోయి, జయసింహుడిలాటి ప్రభువు ఎక్కడా ఉండడని చెప్పుకోసాగారు.

జయసింహుడి భార్య రూపమతి రాణి అయేనాటికి గర్భవతిగా ఉన్నది. రాజ్యాభి షేకం జరుపుకున్న కొద్ది మాసాలకు జయ సింహుడు శత్రురాజులతో యుద్ధాలు చేయ






వలసి వచ్చింది; ఎందుకంటే, విజయసింహుడు పోగానే పరిసర రాజ్యాలవారికి పాంచాలాన్ని తేలికగా జయించవచ్చునని భ్రమకలిగింది.

జయసింహుడు యుద్ధాలమీద బయలుదేరిన కొద్ది రోజులకు రూపమతి కవల పిల్లలను కన్నది. పిల్లలను చూసుకున్న ఆనందంతో బాటు ఆమెకు ఆందోళన కూడా కలిగింది. ఈ పిల్లలు ఎంత అన్యోన్యంగా పెరిగినా రాజ్యం సమస్య వచ్చేసరికి ఒకరి ప్రాణాలు ఒకరు తీసుకుంటారు. తన భర్త తన అన్నను ఎంతో ప్రేమించికూడా రాజ్యం కోసం హత్య చేయించటం ఆమెకు తెలుసు. రాజ్య లోభం అంత క్రూరమైనది.

అందుచేత రూపమతి తనకు ప్రసవం చేయించిన చెలికత్తెతో, "మాధవీ, నువు నాకు ఒక ఉపకారం చెయ్యాలి. నాకు ఇద్దరు పిల్లలు వద్దు. వీళ్లలో ఒకణ్ణి ఏ అడవిలోనో వదిలేసిరా. వీడి వెంట పదివేల వరహాల మూట కూడా ఉంచు. ఎవరైనా ఆశపడి వాణ్ణి పెంచుతారు," అన్నది.

మాధవి అలాటి పని చేయనన్నది. అప్పుడు రూపమతి విధిలేక తన భర్త చేసిన నేరాన్ని మాధవికి చెప్పేసింది. మాధవి కొంచెంసేపు ఆలోచించి, రాణి చెప్పినట్టు చెయ్యటానికి ఒప్పుకుని ఒక బిడ్డనూ, పదివేల వరహాల మూటనూ తీసుకొని వెళ్లిపోయింది.

రూపమతి తాను చేసిన పనికి పశ్చాత్తాప పడలేదుగాని, ఎంతో బాధపడింది.

రూపమతికి కవల పిల్లలు పుట్టిన సంగతి అంతఃపురంలో ఎవరికీ తెలీదు. యుద్ధాలలో శత్రువుల నందరినీ ఓడించి తిరిగి వచ్చిన జయసింహుడు తన భార్యకు కొడుకు కలిగాడని తెలుసుకుని ఎంతగానో సంతోషించాడు. వాడికి జయచంద్రుడు అని పేరుపెట్టి ఎంతో గారాబంగా పెంచసాగాడు.

మాధవి రాణి ఇచ్చిన పిల్లవాణ్ణి ఎక్కడా పారేయలేదు. ఆమె వాణ్ణి తన యింటికే తీసుకుపోయి, మాధవుడు అని పేరుపెట్టి, ఏ లోపమూ లేకుండా పెంచసాగింది.

జయచంద్రుడు దినదినాభివృద్ధి చెందుతూ ఉంటే రూపమతి తన రెండో కొడుకు ఎక్కడ ఉన్నాడో, ఎలా ఉన్నాడో నని ఎంతో ఆవేదన పడేది.

కాలం గడిచింది. జయచంద్రుడు యుద్ధ విద్యలన్నిటా ప్రవీణుడై యుక్త వయసుకు వచ్చాడు. ఒక విజయదశమినాడు జయసింహుడు జయచంద్రుడి చేత విద్యాప్రదర్శన ఏర్పాటు చేసి, ఏ విద్యలోనైనా జయ చంద్రుణ్ణి మించినవాడికి బహుమానాలిస్తా నని ప్రకటించాడు. ప్రదర్శనలు చూడ టానికి జనం తండోప తండాలుగా వచ్చారు. కొద్దిమంది యువకులు రాజుగారిచ్చే బహుమా నాలకు ఆశపడో, యువరాజుగారి చేతిలో ఓడిపోయామని కీర్తితెచ్చుకోవటానికో జయ చంద్రుడితో పోటీ చేసి ఓడిపోయారు. చివరకు జయచంద్రుడు జనాన్ని చూసి, "నాతో పోటీ చెయ్యగలవారు ఇంకెవరూ లేరా?" అని దర్పంగా అడిగాడు.

అప్పుడు జనంలో నుంచి మాధవుడు ముందుకు వచ్చాడు. ఇద్దరూ కత్తియుద్ధం ప్రారంభించారు. ఇద్దరినీ ఒకేచోట చూసిన ప్రేక్షకులకు వారిద్దరూ ఒకే పోలికా, ఒకే ఒడ్డూ, పొడుగూ ఉండటమూ అమిత ఆశ్చ ర్యాన్ని కలిగించింది. జయసింహుడూ, రూపమతీ కూడా ఆశ్చర్యపడ్డారు.

జయసింహుడు ఈ రహస్యం తెలుసుకుందామని, "ఆగండి!" అని కేకపెట్టి కత్తి యుద్ధం ఆపించాడు. తరవాత ఆయన మాధవుణ్ణి దగ్గిరికి పిలిచి, రూపమతి



వింటూండగా, "నువ్వు ఎవరి కొడుకువు? నీ పేరేమిటి?" అని అడిగాడు.

మాధవుడు నవ్వి, "మహారాజా, ప్రజలందరూ మీ బిడ్డలేగదా! నన్ను కూడా మీ బిడ్డే అనుకోండి!" అన్నాడు.

ఈ మాట వింటూనే రూపమతి మూర్ఛపోయింది. జయసింహుడు రాణిని అంతఃపురానికి చేర్చి, శైత్యోపచారాలు చేయించాడు.

రూపమతి స్పృహ వొస్తూనే తన చుట్టూ వున్న జనంలో మాధవినీ, ఆమె పక్కన ఉన్న మాధవుణ్ణీ చూసి, "నా బాబూ!" అంటూ మాధవుడి కేసి చేతులు చాచింది. మాధవి మాధవుణ్ణి రూపమతి కేసి తోసింది.

రూపమతి ప్రవర్తన మాధవికి మాత్రమే అర్థమయింది. ఆమె మాధవుణ్ణి కౌగలించుకుని ఆనందబాష్పాలు రాలుస్తున్నది.

తన భార్యకు మతి చెడిందనుకుని జయసింహుడు, "ఏమిటి నువ్వు చేస్తున్నది?" అని అడిగాడు.

"వీడు మన కొడుకే మహారాజా. జయచంద్రుడూ, వీడూ కవలపిల్లలు. ఇద్దరు పిల్లలుంటే సింహాసనం కోసం రక్తపాతం జరుగుతుందని భయపడి, ఒక పిల్లవాణ్ణి మాధవి కిచ్చి ఎక్కడన్నా వదిలెయ్యమన్నాను. ఇంత కాలానికి నా బిడ్డ నాకు తిరిగి దొరికాడు," అన్నది రూపమతి.

అప్పుడు మాధవి తానా బిడ్డను రహస్యంగా ఎలా పెంచిందీ జయసింహుడికి తెలిపింది. తాను తన అన్నను హత్య చేసిన నేరానికి తన సొంత కొడుకు ఇన్ని ఏళ్లు తనకు కాకుండాపోవటం శిక్ష అని గ్రహించి జయసింహుడు రూపమతితో, "రాణీ, ఇక సింహాసనం కోసం రక్తపాతం జరిగే సమస్య లేదు. రాజ్యాన్ని నా ఇద్దరు కొడుకులకూ సమంగా పంచుతాను," అన్నాడు.

ఈ మాటకు రూపమతి పరమానందం చెందింది. ఆమె తన ఇద్దరు కొడుకులనూ చూసుకుంటూ ఎంతో ఆనందం పొందింది. జయసింహుడు అన్నమాట నిలబెట్టుకుంటూ తన రాజ్యాన్ని కొడుకు లిద్దరికీ సమంగా పంచి, తాను బతికి ఉండగానే ఇద్దరికీ రాజ్యాభిషేకం చేయించాడు.






# జాగ్రత్తగలవాడు

ఒక గ్రామంలో రంగయ్య అనే బీదవాడికి మధ్య వయసు దాటుతూ ఉండగా ఒక కొడుకు పుట్టాడు. వాడి పేరు వెంకటప్ప. వెంకటప్పకు పన్నెండేళ్ళు నిండేసరికి, అతని తండ్రికి పూర్తిగా శక్తి ఉడిగి పోయింది. అంతేగాక కుటుంబాన్ని పోషించటానికి అమితంగా కష్టపడుతున్నాడు. నూరు రూపాయల అప్పు కూడా ఉన్నది.

ఈ సంగతి గ్రహించిన వెంకటప్ప తన తండ్రితో, "ఇక నువ్వేమీ కష్టపడవద్దు. నేనే ఎక్కడికైనా వెళ్ళి, డబ్బు సంపాదించి తెస్తాను," అని చెప్పి, మరొక గ్రామానికి వెళ్ళి, దొరికిన పని చేస్తూ డబ్బు సంపాదించసాగాడు.

వెంకటప్పకు ఒక ముసలిది తన ఇంట ఆశ్రయం ఇచ్చింది. వెంకటప్ప ఆమెకు అన్నివిధాలా సహాయపడుతూ, తన సొంత ఇంట ఉంటున్నట్టే ఉంటున్నాడు.

ఒకసారి ముసలిది వెంకటప్పతో, "నాయనా, కొత్త వాణ్ణి మూడుసార్లు పరీక్షించి గాని నమ్మకూడదు. నేను నిన్ను అలాగే పరీక్షించాను. డబ్బు విషయంలో మరీ జాగ్రత్తగా ఉండాలి," అన్నది.

వెంకటప్ప తాను సంపాదించే కూలి డబ్బులు ఒక ముంతలో వేసి, దాన్ని చూరులో దాచేవాడు. అప్పుడప్పుడూ ముంతను దించి, డబ్బులు లెక్కపెట్టి, ఎంత పోగైనదీ ఎంచుకునేవాడు.

ఒకసారి ముసలమ్మ తన కూతురి వద్దకు వెళ్ళింది. ఇంట్లో వెంకటప్ప ఒక్కడే ఉన్నాడు. అతను తన ముంతలో పోగైన డబ్బు లెక్కపెట్టి, భోజనం చెయ్యబోతూ ఉండగా, బయటి నుంచి, "ఆకలి! కాస్త అన్నం పెట్టు తల్లీ!" అని ఎవరో దీనంగా కేక పెట్టారు. వెంకటప్ప ఆ బిచ్చగాడి ముఠికి జోలెలో ఇంత అన్నం తెచ్చి వేశాడు.

సి. నాగేశ్వరరావు

బిచ్చగాడు అతనితో, "అయ్యా, నేను ఊళ్ళవెంబడి తిరిగే బిచ్చగాణ్ణి. ఈ రాత్రికి మీ వసారాలో పడుకోనిస్తే, తెల్లారి లేచి పోతాను," అన్నాడు.

వెంకటప్ప వాణ్ణి చూసి జాలిపడి సరే నన్నాడు. సరేనని అనేసిన తరవాత అతనికి ముసలమ్మ చేసిన హెచ్చరిక జ్ఞాపకం వచ్చింది: కొత్తవాణ్ణి మూడుసార్లు పరీక్షించి గాని నమ్మరాదు; డబ్బు విషయంలో అసలు నమ్మరాదు! ఈ బిచ్చగాడు కొత్తవాడే మరి.

వెంకటప్ప డబ్బు ముంతను వంటింటో ఒక మూల పెట్టి, తలుపు బాగా మూసి, తాను వచ్చి ముందు గదిలో పడుకున్నాడు.

బయటి వసారాలో పడుకున్న వాడు నిజంగా దొంగే. వాడి మురికి జోలె అడుగున దొంగిలించిన సొమ్ములున్నాయి. వెంకటప్ప ముంతలో డబ్బులు ఎంచి పొయ్యటం చూసిన మీదటనే వాడు, "ఆకలి!" అని కేక పెట్టాడు. డబ్బు ముంత వంటఇంట్లో వెంకటప్ప దాచటం కూడా వాడు గమనిస్తూనే ఉన్నాడు.

అర్ధ రాత్రివేళ ఆ దొంగ లేచి, ఇంటి వెనక్కు వెళ్ళి, వంట ఇంటికి కన్నం పెట్టి లోపలికి ప్రవేశించాడు. లోపలికి దూరుతూ ఉండగానే వాడి కళ్ళకూ, ముక్కుకూ ఘాటైన పొగతగిలి, తుమ్ములు రాసాగాయి, దగ్గు పట్టుకున్నది. వెంకటప్ప తాను పడుకోబోయేముందు పొయిలో మిరపతొక్కలూ, కాడలూ, ఇతర తుక్కూ వేశాడు. వాటి పొగ ఇంటి నిండా కమ్ముకుని ఉన్నది.

దొంగ చేసిన అలికిడికి వెంకటప్ప లేచి, వంట ఇంట్లోకి వెళ్ళాడు. కన్నంలో నుంచి బయటికి జారుకుంటున్న దొంగ కాళ్ళు పట్టుకుని లోపలికి లాగి, తాడుతో వాణ్ణి కట్టిపడేశాడు.

తరవాత నలుగురూ వచ్చి చేరి దొంగను గ్రామాధికారికి అప్పగించారు. దొంగ జోలెలో ఊళ్ళోవాళ్ళ సొమ్ములు చాలా దొరికాయి. వాటిని పోగొట్టుకున్న వాళ్ళు వెంకటప్పకు తమ శక్తి కొద్దీ బహుమానాలిచ్చారు. ఈ బహుమానాలతో వెంకటప్ప తన తండ్రి చేసిన బాకీ తీర్చి, సుఖంగా జీవించాడు.






# ఒకరోజు రాజు

## 3

అబూ అల్ హసన్‌కు ఇప్పుడు తాను ఖలీఫానే నన్న నమ్మకం పూర్తిగా ఏర్పడిపోయింది. అతను కూర్చున్న బంగారు భోజనశాల రంగురంగుల తెరలతోనూ, తివాసీలతోనూ, దీపాల కాంతిలో అత్యద్భుతంగా ఉన్నది. గది మధ్య ఏడు బంగారు పళ్ళాలలో రకరకాల మాంసాహారాలు ఎత్తు పీటలపై అమర్చి ఉన్నాయి. వాటి పక్కన ఏడుగురు అందగత్తెలైన యువతులు వింజామరలు పట్టుకుని నిలబడి ఉన్నారు. గది నిండా అగరుధూపం వాసనలు వ్యాపించి ఉన్నాయి.

హసన్ నిన్న చేసిన భోజనం తరవాత ఏమీ తిని ఉండకపోవటంచేత ఆత్రంగా వెళ్ళి పళ్ళాల ముందు కూర్చున్నాడు. వెంటనే ఏడుగురు యువతులూ వింజామరలు వెయ్యసాగారు. హసన్‌కు భోజనం వేళ అంత గాలి అలవాటు లేదు. అందుచేత అతను ఒక్క నీగ్రో యువతిని మటుకే వీచమని చెప్పి మిగిలినవాళ్ళను తన కెదురుగా, అర్ధచంద్రాకారంలో కూర్చోమని, వారిని చూస్తూ తాను భోజనం చెయ్యసాగాడు.

భోజనం ముగిసింది. కొజ్జాలు వచ్చి, అతను చేతులు కడుక్కోవటానికి నీరు తెచ్చి ఇచ్చి, మరొక గదిలోకి దారి చూపారు. ఆ గది భోజనాల గది కన్న కూడా అందంగా ఉన్నది. అక్కడ ఏడు రకాల పళ్ళు అమర్చి ఉన్నాయి. ఏడుగురు అందగత్తెలు నిలబడి ఉన్నారు. హసన్ అన్నిరకాల పళ్ళూ చవి చూసి, మరొక గదికి వెళ్ళాడు.

అక్కడ అందమైన సీసాలలోనూ, బంగారు కూజాలలోనూ అపూర్వమైన పానీ

యాలు ఉన్నాయి. వాటిని అతనికి అందించటానికి అందగత్తెలున్నారు. హసన్ వారినందరినీ తన చుట్టూ కూర్చోమని వాళ్ళు అందించే పానీయాలు తాగసాగాడు. వారిలో ఒకతె అతనికి మత్తుమందు కలిపిన పానీయం అందించింది. అది తాగుతూనే హసన్ స్పృహ లేకుండా పడిపోయాడు.

ఇంతదాకా తెరల వెనక దాగి హసన్ చర్యలు గమనించి ఆనందిస్తున్న ఖలీఫా ఇప్పుడు ఇవతలికి వచ్చాడు. ఆయన బానిసలను పిలిచి, హసన్ ధరించిన రాజ వస్త్రాలు విప్పమనీ, అతని అసలు దుస్తులు తొడగమనీ చెప్పాడు. తరవాత ఆయన, క్రితం రోజు హసన్‌ను రాజభవనానికి చేర్చిన బానిసను పిలిచి, "ఇతన్ని ఇతని ఇంటికి చేర్చి పడుకోబెట్టి రా," అని ఆజ్ఞాపించాడు. ఆ బానిస అలాగే చేశాడు. ఈసారి అతను మరిచిపోకుండా హసన్ తలవాకిలి తలుపులు మూసి మరీ వచ్చాడు.

మర్నాడు మధ్యాన్నందాకా హసన్ ఒళ్ళు తెలియకుండా నిద్రపోయాడు. అప్పటికి మత్తు వదిలి అతనికి స్పృహ వచ్చింది. అతను కళ్ళు తెరవకుండానే తాను కిందటి రోజు చూసిన యువతులందరినీ జ్ఞాపకం తెచ్చుకుని, వారందరినీ పేర్లు పెట్టి పిలిచి, రమ్మని కేకలు పెట్టాడు. కాని ఎవరూ వచ్చిన జాడ లేకపోయే సరికి అతను కోపంగా లేచి కూచుని, కళ్ళు తెరిచాడు.

తాను రాజభవనంలో కాక, తన మామూలు ఇంట్లోనే ఉన్నట్టు తెలిసింది.



ఇది కల అయి ఉంటుందనుకుని హసన్, "జఫర్, జఫర్! మస్రూర్! ఎక్కడ చచ్చారు?" అని అరిచాడు.

ఈ కేకలకు అతని తల్లి పరిగెత్తుకుంటూ వచ్చి, "ఏమిట్రా, నాయనా, అబూ అల్ హసన్? ఏమయింది? ఏమన్నా కల గన్నావా?" అని అదుర్దాగా అడిగింది.

"ముసలిదానా, నువ్వెవరు? ఈ అబూ అల్ హసన్ ఎవడు?" అన్నాడు హసన్.

"అబూ అల్ హసన్ నువ్వే గదరా! నేను మీ అమ్మను గాదూ? నన్నెందుకు గుర్తు పట్టలేకుండా ఉన్నావూ?" అన్నది హసన్ తల్లి.

"పోవే, పీడాకారపు దానా? నువు ఎవరితో మాట్లాడుతున్నావో తెలుసా? నేను ఖలీఫా హారూనల్ రషీద్‌ను. భూమి మీద అల్లా ప్రతినిధిని. పో అవతలికి!" అని హసన్ కేకలు పెట్టాడు.

అతని తల్లి ఆందోళనపడుతూ, "అర్థం లేకుండా ఏమిట్రా ఆ మాటలు? అలా అరిస్తే చుట్టుపక్కలవాళ్ళు వినగలరు. కొంప మునిగిపోతుంది! శాంతించరా, బాబూ, నీకు పుణ్యం ఉంటుంది!" అన్నది.

హసన్ మరింత గట్టిగా అరుస్తూ, "ముసలితొత్తూ; నిన్ను పొమ్మనలేదూ? నేను నీ కొడుకునంటావు. నీకు మతి ఉన్నదా? నేను హారూనల్ రషీద్‌ను. తూర్పు పడమరలకు ఏలికను!" అన్నాడు.

హసన్ తల్లి మొహం బాదుకుని మొత్తుకుంటూ, "నీకు సైతాను పూనింది. నిన్ను





అల్లాయే కాపాడాలి. నీ మతి ఇంతగా ఎలా చెడింది? పుట్టినప్పటి నుంచీ నా దగ్గిరే ఉంటివి గదా, ఈ ఇంట్లోనే పెరిగితివి గదా! కాసిన మంచి నీళ్ళు తాగు, నాయనా, నిద్రమత్తు వదులుతుంది!" అన్నది.

ఆమె ఇచ్చిన నీరు తాగి హసన్, "ఒక వేళ నేను అబూ అల్ హసన్ అయినా అయి ఉండవచ్చు!" అనుకుంటూ చాలాసేపు ఆలోచనలో మునిగి ఉండి, చివరకు, "అవును, నేను అబూ అల్ హసన్‌నే. ఇది నా గదే. నువు నా తల్లివే. నా మీద ఏదో ప్రయోగం జరిగింది," అన్నాడు.

హసన్ తల్లి ఆనందబాష్పాలు తుడుచుకుంటూ, తన కొడుకు బాగైనాడు గదా అనుకున్నది. ఆమె వంట చెయ్యబోయే ముందు తన కొడుక్కు వచ్చిన కల ఎలాటిదో తెలుసుకుందా మనుకుంటూండగా, హసన్ చప్పున మంచం మీది నుంచి కిందికి దూకి, తల్లిని పట్టుకుని ఊపుతూ, "తప్పుడుదానా, నా శత్రువు లెవరు నా రాజ్యం కాజేసి, నన్ను ఈ కుళ్ళు కొంపలో ఖైదు చేశారో చెప్పకపోయావో నీ ప్రాణాలు తీస్తాను! నాకు తిరిగి సింహాసనం వచ్చాక నా ఆగ్రహానికి అంతుండదు, జాగ్రత్త! ఖలీఫా ఆగ్రహం అంటే ఏమిటో మరవకు! ఈ కుట్ర చేసినవాళ్ళని ఈ ఖలీఫా క్షమించడు!" అన్నాడు.

అతను ఆమెను వదిలేసి తిరిగి మంచం ఎక్కి, తల చేతుల్లో పట్టుకుని కూర్చున్నాడు. అతని తల్లి కుప్పకూలిపోయి, గుండె పగిలేటట్టు ఏడవ సాగింది.

కొంతసేపు ఏడ్చిన మీదట ఆమె లేచి వెళ్ళి, ఎంతైనా తల్లి గనక, పన్నీరు కలిసిన షర్బతు తెచ్చి, "తాగు, నాయనా!" అని హసన్ చేత తాగించింది.

తరవాత ఆమె తన కొడుకు ఆలోచనలను మళ్ళించటానికి "ఒరే, నిన్న ఒక తమాషా జరిగింది. నువు వింటే ఎంతో సంతోషిస్తావు. నిన్న రాజభటులు వచ్చి మన పేట అధికారినీ, వాడి కింద పనిచేసే ఇద్దరినీ పట్టుకుని, తలా నాలుగువందల

బెత్తం దెబ్బలూ కొట్టి, ఒంటె మీద వెనక్కు తిప్పి కూచోబెట్టి ఊరేగించి, కొరత వేశారు," అన్నది.

ఈ మాట విని హసన్ ఉపశమనం పొందటానికి బదులు రెచ్చిపోయి, "పాపిష్టి ముండా, నేను పొరబడలేదని నువే రుజువు చేస్తున్నావు. ఆ ముగ్గురినీ శిక్షించమని అహ్మద్‌ను పంపినది నేనే! నేను కల గంటున్నాననీ, నాకు సైతాను పూనాడనీ మరొకసారి అనేవు! సాష్టాంగపడి, అన్న దానికి క్షమాపణ వేడుకో!" అన్నాడు.

హసన్‌కు పిచ్చిపట్టిందని అతని తల్లి రూఢి చేసుకున్నది. ఆమె రొమ్ము బాదు కుని ఏడుస్తూ, "అల్లా కనికరించి నీ పిచ్చి కుదర్చాలి! నువు మాత్రం ఖలీఫా పేరు ఎత్తకు. నువే ఖలీఫానని అసలు అనకు. ఇరుగుపొరుగువాళ్ళు విని వలీతో చెప్పా రంటే, అతడు నిన్ను రాజభవనం ముందు ఉరి తీస్తాడు," అన్నది.

దీనితో హసన్ మరింత రెచ్చిపోయి, మూలనున్న కర్రతీసి తల్లి మీదికి వస్తూ, "నన్ను అబూ అల్ హసన్ అని పిలవకు. నేను హారూనల్ రషీద్‌ను. కాదన్నావంటే నీ బుర్ర బద్దలు కొడతాను," అన్నాడు.

కొడుకు ఇలా అంటుంటే తల్లికి కోపమూ, దుఃఖమూ కూడా వచ్చింది. ఆమె ఎంతో శాంతంగానూ, ప్రేమగానూ,



"నీ మతి ఇంతగా ఎలా చలించిందిరా, బాబూ? నువు ఖలీఫానని చెప్పుకోవటం నేరమన్న మాట అలా ఉంచి, ఎంత అప చారం! కృతఘ్నత కూడానూ! నిన్న ఆ మహాప్రభువు నాకు వెయ్యి బంగారు దీనారాలు పంపి, ఇంకా పంపుతానని కబురు కూడా చేశాడు," అన్నది.

తాను ఖలీఫాయే నన్న విషయంలో హసన్‌కు ఏ మాత్రమన్నా సందేహం మిగిలి ఉంటే, ఈ మాటతో అది పూర్తిగా పోయింది. ఎందుకంటే కిందటి రోజు ఆమెకు తానే వెయ్యి దీనారాలు పంపాడు.

హసన్ తల్లి కేసి గుడ్లు ఉరిమి చూస్తూ, "ఆ దీనారాలు పంపినది నేను కాదంటావా?



ఆ ధనం తెచ్చినవాడు నా ఆజ్ఞ మీద రాలే దంటావా? ఇంకా నేను అబూ అల్‌హసన్‌నే ననటానికి నీ కెన్నిగుండెలు?" అంటూ తల్లిని కర్రతో బాదసాగాడు.

ఆ దెబ్బలతో ఆమె మాతృప్రేమ అడుగంటింది. ఆమె ఎలుగెత్తి ఇరుగు పొరుగు వాళ్ళను కేక పెట్టింది. త్వరలోనే ఇరుగు పొరుగువాళ్ళు పరిగెత్తుకుంటూ వచ్చి, హసన్ బారి నుంచి తల్లిని కాపాడి, హసన్‌ను గట్టిగా పట్టుకుని, "తల్లి మీదనే చెయ్యి చేసుకుంటున్నావు నీ కేమన్నా పిచ్చి పట్టిందిరా, అబూ అల్‌హసన్? అని మందలించారు.

హసన్ తీవ్రంగా, "అబూ అల్‌హసన్ ఎవడు?" అని అడిగాడు.

పొరుగువాళ్ళు ఆశ్చర్యపోతూ, "నువు అబూ అల్ హసన్‌వి కావూ? ఈవిడ నిన్ను కని పెంచిన నీ తల్లి కాదూ?" అన్నారు.

"గాడిదలు! గాడిద కొడుకులు! పొండి అవతలికి. నేను మీ ప్రభువును, ఖలీఫా హారూనల్ రషీద్‌ను!" అన్నాడు హసన్.

హసన్ నిశ్చయంగా పిచ్చివాడేనని పొరుగువాళ్ళకు నమ్మకం కుదిరింది. ఆ స్థితిలో అతన్ని స్వేచ్ఛగా ఉండనివ్వటం ప్రమాదమనుకుని, వాళ్ళు అతని చేతులూ, కాళ్ళూ కట్టేసి, ఉన్మాదశాలకు కబురు చేశారు. ఒక గంటలోపుగా ఉన్మాదశాల మనిషి, ఇద్దరు రక్షకులను తోడుతీసుకుని వచ్చాడు. రక్షకుల వద్ద కమ్చీలూ, సంకెళ్లూ, గొలుసులూ వగైరా సరంజామా అంతా ఉన్నది.

వాళ్ళను చూడగానే హసన్ పెనగులాడ సాగాడు. అది చూసి ఉన్మాదశాల వాడు హసన్ వీపుమీద కంచీతో రెండు మూడు దెబ్బలు కొట్టి, అతనికి గొలుసులు వేశాడు. తాను ఖలీఫానని చెబుతున్నా వినిపించుకోకుండా ఉన్మాదశాల నుంచి వచ్చిన ముగ్గురూ హసన్‌ను ఉన్మాదశాలకు తీసుకుపోయి, కటకటాల గదిలో అతన్ని అడవి మృగాన్ని బంధించినట్టు బంధించి, ప్రథమ చికిత్స కింద యాభై కొరడా దెబ్బలు కొట్టారు.

పదిరోజుల పాటు ఉదయమూ, సాయం కాలమూ ఇదేవిధంగా చికిత్స సాగినమీదట హసన్ ఆలోచనా ధోరణిలో మార్పు వచ్చింది.

"నాకు గొప్ప దుర్దశకలిగింది. అందరూ నన్ను పిచ్చివాడనుకుంటున్నారంటే, పొర పాటు నాదే అయి ఉండాలి. నేను రాజ భవనంలో ఉన్నట్టు కలగన్నాను కాబోలు. కాని అది కలలాగా అనిపించలేదు. ఈ మాయను అర్థం చేసుకోవటానికి, ప్రయత్నిస్తే నిజంగానే నాకు పిచ్చి ఎత్త వచ్చు. అల్లా ఇలాటి మాయలు ఎన్ని కల్పించాడో!" అనుకున్నాడు హసన్.

అతను ఇలా అనుకుంటూండగా, అతని తల్లి అతన్ని చూసి పోదామని ఏడుస్తూ వచ్చింది. అతని దీనస్థితి చూసి ఆమెకు గుండె నీరయిపోయింది. ఆమె తన దుఃఖాన్ని అణచి పెట్టుకుని, "ఎలా ఉన్నావు, నాయనా, అబూ అల్ హసన్?" అని మృదువుగా అడిగింది.

"అమ్మా, అల్లా నిన్ను కాపాడు గాక!" అన్నాడు హసన్ శాంతంగా.

ఆమె ఆనంద పరవశురాలై, "భగ వంతుడి దయవల్ల నీ మనసు బాగుపడింది, నాయనా!" అన్నది.

"అల్లానూ, నిన్నూ క్షమాపణ వేడు కుంటున్నా నమ్మా. అలా పిచ్చిగా ఎందుకు వాగానో నాకే అర్థం కావటం లేదు. సైతాను నన్ను ఆవహించి, నాచేత అలా మాట్లాడించి ఉండాలి. కాని అదంతా అయిపోయింది. నేను బాగుపడ్డాను," అన్నాడు హసన్.

"నిన్ను మళ్ళీ కన్నంత ఆనందంగా ఉందిరా నాకు!" అన్నది హసన్ తల్లి.

"నన్ను ఇక్కడి నుంచి విడిపించమ్మా?" అన్నాడు హసన్.

హసన్ తల్లి చెప్పిన మీదట ఉన్మాదశాల వాళ్ళు అతన్ని పరీక్షించి, పిచ్చి పోయిందని రూఢి చేసుకుని, గొలుసులు విప్పి అతన్ని వదిలిపెట్టారు. అతను తడబడుతూ నడిచి తల్లి వెంట ఇంటికి చేరుకుని, కొరడా దెబ్బల నుంచి కోలుకోవటానికి చాలా రోజులు మంచంలోనే ఉండిపోయాడు.

—(ఇంకా వుంది)





# అబ్బా!

ఒక దూరదేశంలో ఒక పేదరాలైన వితంతువు ఉండేది. ఆమెకు ఒక అందమైన కొడుకు ఉండేవాడు. వాడి పేరు విక్రముడు. పేరైతే గొప్పదే గాని వాడు పనికి మహ మొండి; పెద్ద సోమరి.

ఒక రోజు తల్లి వాణ్ణి, "చితుకులు ఏరుకు రారా. రెండు రొట్టెలు కాలుస్తాను," అని అడిగింది.

"రొట్టెలు కాల్చకపోతేనేం? పచ్చిపిండి తింటేపోలా?" అన్నాడు విక్రముడు.

వాడికి పని చెప్పి లాభం లేదనుకుని వాడి తల్లి తానే ఊరి బయటి తోపుల్లోకి వెళ్ళి, కింద రాలిన ఎండుపుల్లలు ఏరి పెద్ద మోపు కట్టి, దాన్ని మోసుకుంటూ తిరిగి రాసాగింది. తిరిగి వచ్చే దారిలో ఒక పాడుబడిన బావి ఉన్నది. దాని గట్టు మీద మోపుదించి విధవరాలు ఆయాసంతో, "అబ్బా!" అన్నది.

మరుక్షణమే బావిలో నుంచి ఒక రాక్షసుడు పైకి దూకి, "నన్నెందుకు పిలిచావమ్మా? నీకేం కావాలి?" అని అడిగాడు.

విధవరాలు వాణ్ణి చూసి బిత్తరపోయి, "లేదండీ, నేను తమర్ని పిలవలేదు," అన్నది.

"నన్ను పిలవకపోవటమేమిటి? అబ్బా అన్నది నా పేరే!" అన్నాడు రాక్షసుడు.

"నాకీ సంగతి తెలియదండీ! ఎదిగొచ్చిన కొడుకు ఉండి కూడా అన్నింటికీ నేనే ఒళ్ళు విరుచుకోవలిసి వస్తున్నది. ఆయాసపడి 'అబ్బా!' అనుకున్నాను," అంటూ విధవరాలు రాక్షసుడికి తన కొడుకు సంగతి చెప్పింది.

అంతా విని రాక్షసుడు, "నీ కొడుకును నా దగ్గిరికి పంపించు. వాణ్ణి తెలివిగల వాణ్ణిగా తయారు చేస్తాను. నీకు దోసెడు బంగారం ఇస్తాను," అన్నాడు.

మధ్యప్రాచ్య జానపద కథ

"తమరు వాణ్ణి తినెయ్యరు గద! తమ రిని చూస్తే నాకు భయంగా ఉన్నది." అన్నది విధవరాలు.

"ఛీ, ఛీ! నాకు మనిషి మాంసం సయిం చదు," అని రాక్షసుడు బావిలోకి దూకి, మళ్ళీ పైకి వచ్చి, దోసెడు బంగారు కాసులు విధవరాలికి ఇస్తూ, "నీ కొడుకును తీసుకు రాకపోయావో, మీ ఇద్దరి ప్రాణాలూ తీస్తాను, గుర్తుంచుకో!" అని హెచ్చ రించాడు.

విధవరాలు చితుకుల కట్ట ఎత్తుకుని ఇంటికి వెళ్ళి, రొట్టెలు కాలుస్తూ కంట తడి పెట్టుకున్నది. అది చూసి విక్రముడు తల్లిని ఎందుకేడుస్తున్నావని అడిగాడు. తల్లి జరి గినదంతా వాడికి చెప్పింది.

"ఆ రాక్షసుడి దగ్గిరికి పోయి తెలివి తేటలు నేర్చుకుంటానమ్మా. విచారం దేనికి?" అన్నాడు విక్రముడు.

తల్లి కొడుకు లిద్దరూ కలిసి బావి వద్దకు వెళ్ళారు. విధవరాలు బావిలోకి తొంగి చూసి, "అబ్బా! అబ్బా!" అని పిలిచింది.

వెంటనే రాక్షసుడు పైకి దూకి, "వీడేనా, అమ్మా, నీ కొడుకు?" అని అడిగాడు. వాడు విధవరాలికి మరో దోసెడు బంగారం ఇచ్చి, విక్రముడితో, "నా వెంట మా యింటికి రా. ఇల్లు కాస్త ఊడ్చటం తప్ప నీకు పని ఏమీ ఉండదు. నేను పగలల్లా ఇంట్లో



ఉండను. నిన్ను అడిగేవారు ఉండరు," అన్నాడు.

"అంతకన్న కావలసిందేమిటి?" అన్నాడు విక్రముడు.

రాక్షసుడూ, విక్రముడూ కలిసి బావిలోకి దూకారు. బావి అడుగున ఒక అందమైన రాజసౌధమూ, దొడ్డీ, తోటా ఉన్నాయి.

రాక్షసుడు విక్రముడితో, "నేను పోతు న్నాను: నువు ఇల్లు కనిపెట్టుకుని ఉండు. నువు తిని, తాగి, ఇష్టం వచ్చినట్టు తిరుగు. నువు దొడ్డిలో యథేచ్ఛగా తిరగవచ్చు, కాని తోటలోకి పోకు. పోయావంటే, ఆ సంగతి నాకు పువ్వులు చెప్పేస్తాయి, నేను నిన్ను చావగొట్టుతాను," అని చెప్పి వెళ్ళిపోయాడు.



తరవాత విక్రముడు భవనమంతా తిరిగాడు. ఒక గదిలో భోజనం వడ్డించి ఉన్నది. విక్రముడు కడుపు నిండా తిని, "ఈ ఉద్యోగం నాకు నచ్చింది," అనుకుని, దొడ్లో చాలా సేపు తిరిగాడు. చివరకు వాడు తోట ద్వారం తెరిచి తోటలోకి అడుగుపెట్టాడు.

అలాటి తోటను వాడు ఎన్నడూ చూడలేదు. అందులో లేని పువ్వులేదు, లేని పక్షి లేదు. పక్షులు చిత్తం వచ్చినట్టు పాడేస్తున్నాయి. పూల నుంచి రకరకాల సువాసనలు వస్తున్నాయి.

"తోటలోకి పోగూడదుట! నేను రోజూ ఇక్కడికే వస్తాను!" అనుకున్నాడు విక్రముడు.

వాడు చుట్టూ చూస్తుంటే ఒక పక్కగా ఒక కుటీరం కనబడింది. కుటీరద్వారంలో ఒక అందమైన కన్య నిలబడి, వాణ్ణి రమ్మని సైగ చేస్తున్నది.

"జాగ్రత్త, పువ్వులు తగలకుండా రా. తగిలితే అవి అబ్బాకు చెప్పేస్తాయి. నీకో మాట చెప్పాలి, ఇలా రా!" అన్న దామె విక్రముడితో.

విక్రముడు జాగ్రత్తగా నడుచుకుంటూ, ఆమె వద్దకు వెళ్ళాడు.

"నువ్విక్కడికి ఎందుకు వచ్చావు? అబ్బా మనుషులను తినని మాట నిజమే గాని, మాంసం తింటాడు. ఎక్కడా తినటానికి మాంసం దొరక్కపోతే, అతను ఇంటికి వచ్చి నీ చేత ఏదో నీరు తాగించి నిన్ను ఒళ్ళు విరుచుకోమంటాడు. ఒళ్ళు విరుచుకోగానే నువు అబ్బా కోరిన జంతువైపోతావు. అప్పుడు అతను నిన్ను చంపి తినేస్తాడు. అందుచేత, అలాటి పరిస్థితి ఏర్పడి నప్పుడు నువు నీరు తాగు కాని, ఒళ్ళు మాత్రం విరుచుకోకు. కాళ్ళు ఆడించు, చేతులు ఆడించు, గుండ్రగా తిరుగు—ఏ దన్నా చెయ్యిగాని ఒళ్ళు మాత్రం విరుచుకోకు. విసుగెత్తి అబ్బా, నా చేత ఎర్ర నీరు తెప్పించి, అది నీ చేత తాగించి, ఫలాని జంతువు కమ్మంటాడు. అయితే, ఆ ఎర్ర నీరు అద్భుత శక్తులు గలది. అది తాగితే అంతులేని

జ్ఞానం వస్తుంది. అది తాగిన మీదట నువు అబ్బా చెప్పిన జంతువే కానక్కర్లేదు, నీ యిష్టం వచ్చిన రూపం పొందగలుగుతావు. పక్షివై ఇక్కడి నుంచి తప్పించుకు పారిపోగలవు కూడా. ఇక్కడి నుంచి తప్పించుకు పోయాక నన్ను కూడా విడిపించే మార్గం చూడు. నువు నన్ను చూసిన సంగతి పరమరహస్యం! వెళ్ళి ఇల్లు ఊడ్చే పని చూసుకో," అన్నదామె విక్రముడితో.

విక్రముడు భవనానికి తిరిగి వచ్చి, చీపిరికట్ట తీసుకుని కొద్దిగా చిమ్మి, దొడ్లోకి వచ్చి ఒక చెట్టు కింద కూర్చున్నాడు.

చాలా సేపటికి అబ్బా వచ్చాడు. వాడికి ఆకలి దహించుకుపోతున్నది. ఆ రోజు వాడికి ఏవో కాయలు తప్ప తినటానికి ఏమీ దొరకలేదు. వాడు వస్తూనే విక్రముణ్ణి, "ఏం చేస్తున్నావు?" అని అడిగాడు.

"ఏముంది? ఇల్లు ఊడ్చాను. విశ్రాంతి తీసుకుంటున్నాను," అన్నాడు విక్రముడు.

"సరే, నీకు కొంచెం చదువు చెబుతాను. ఈ నీరు కొంచెం తాగి, ఒళ్ళు విరుచుకుని కుందేలు కా!" అంటూ అబ్బా, విక్రముడి చేత ఏదో నీరు తాగించాడు.

విక్రముడు చేతులాడించాడు, ఒక కాలు మార్చి ఇంకో కాలుమీద నిలబడ్డాడు.

"ఛీ, ఏం చేస్తున్నావు? ఒళ్ళు విరుచుకో!" అన్నాడు అబ్బా.



"నేను ఒళ్ళు విరుచుకోవటం లేదా?" అని విక్రముడు అమాయకంగా అడిగాడు.

"నువు ఇంత మందమతివా?" అంటూ అబ్బా ఇంకో పాత్రలో నీరు తాగించి, విక్రముణ్ణి ఒళ్ళు విరుచుకుని మేక కమ్మన్నాడు. కాని విక్రముడికి ఒళ్ళు విరుచుకోవటం ఏమిటో తెలిసినట్టు కనబడలేదు. వాడు శీర్షాసనమైనా వేశాడు గాని ఒళ్ళు విరుచుకోలేదు. అబ్బాను ఆకలి దహించుతున్నది.

వాడు తోటలోని కుటీరానికి వెళ్ళి అక్కడ ఉండే పిల్లతో, "ఇవాళ ఎంత తిరిగినా నాకు మాంసం దొరకలేదు. ఈ మొద్దు వెధవను ఒళ్ళు విరుచుకోరా అంటే విరుచుకోలేకుండా ఉన్నాడు," అన్నాడు.



"ఎర్రనీరు తాగితే వాడికి ఒళ్ళు విరుచుకోవటం చాతనవుతుంది," అన్నదా పిల్ల.

"ఎర్ర నీరు తాగితే వాడు తెలివి తేటల్లో నా అంతటి వాడూ అయిపోతాడు గద?" అన్నాడు అబ్బా.

"అయి ఏం బావుకుంటాడు? ఒళ్ళు విరుచుకోగానే నువు ఏం కమ్మంటే అది అయిపోతాడుగా?" అన్నదామె.

"అది నిజమే. ఏదీ, ఎర్ర నీరు తీసుకురా!" అన్నాడు అబ్బా.

ఆ పిల్ల కుటీరంలో నుంచి ఎర్రనీరు తెచ్చింది. అబ్బా లోటాలో ఆ నీరు తీసుకుపోయి విక్రముడికి ఇచ్చి, "ఇది తాగి, ఒళ్ళు విరుచుకుని జింకవికా!" అన్నాడు.

విక్రముడు ఆ నీరు తాగి, జింక కావటానికి బదులు పావురం కావాలనుకున్నాడు. వెంటనే వాడు పావురమైపోయి, బావి కుండా పైకి ఎగిరిపోయాడు.

అబ్బా ఆలస్యం చెయ్యకుండా తాను డేగ అయి పావురం వెనకే బయలుదేరాడు. డేగ పావురాన్ని చాలాసేపు తరిమి పట్టుకోబోయే క్షణంలో పావురం కాస్తా ఈగగా మారి, ఒక స్నానశాల తలుపులోని బీగం కంతలో దూరింది.

వెంటనే డేగ, ఒక ధనికుడుగా మారి స్నానశాలను నిర్వహించే వాడితో, "ఈ స్నానశాలను అమ్ముతావా?" అని అడిగాడు.

"తగిన ధర వస్తే ఎందుకు అమ్మను?" అన్నాడు స్నానశాల వాడు.

పెద్దమనిషి వాడు అడిగినంత బంగారం ఇచ్చి స్నానశాల బీగాలు పుచ్చుకున్నాడు. వెంటనే ఈగ బయటికి వచ్చి అటూ ఇటూ ఎగరసాగింది. వెంటనే ధనికుడు కాస్తా ఒక పిచ్చుకగా మారి ఈగను వెంబడించాడు. ఈగ పిచ్చుకకు చిక్కే క్షణంలో రాజభవనంలోకి దూరి, ఒక సంపంగిపువ్వుగా మారి రాజకుమార్తె ఒడిలో పడింది. రాజకుమార్తె దాన్ని చూసి ఎంతో సంతోషించి తన జడలో పెట్టుకుంది.

ఈలోపల పిచ్చుకరూపంలో ఉన్న అబ్బా టర్కీ రాయబారిగా మారి, రాజదర్శనం

చేసుకుని, "మహారాజా, నేను మా దేశం నుంచి బయలుదేరేటప్పుడు మా అమ్మ నన్ను దీవించి నా కొక సంపెంగపువ్వు ఇచ్చింది. నాకు ఎంతో పవిత్రమైన ఆ పువ్వును ఒక గోరింక నా కోటు నుంచి లాగేసి తీసుకుపోయి, తమ కుమార్తె మందిరంలో పడవేసింది. తమరు నా పువ్వును నాకు తిరిగి ఇప్పించాలి," అన్నాడు.

ఈ లోపల విక్రముడు అందమైన యువకుడుగా మారి, "రాజకుమారీ, నే నొక రాజకుమారుణ్ణి. నా కోసం ఒకడు వచ్చి అడుగుతాడు. వాడు నా గర్భశత్రువు. మంత్రవిద్యలో ఇద్దరమూ సమానులం. అందుచేత వాడు నన్ను నిర్మూలించటానికి చూస్తున్నాడు. నన్ను వాడికి ఇవ్వకు, నీకు పుణ్యం ఉంటుంది," అని చెప్పి, తిరిగి పువ్వుగా మారిపోయాడు.

అంతలో ఒక చెలికత్తె రాజకుమారి దగ్గిరికి వచ్చి, "రాజకుమారీ, నీ ఒళ్ళో పడిన సంపెంగపువ్వును మహారాజుగారు తెమ్మంటున్నారు," అన్నది.

రాజకుమార్తె చిరాకుగా, "తోటలో ఎన్ని సంపెంగపూలు లేవు? నాలుగు కోసుకుపోయి మహారాజుగారికి ఇయ్యి," అన్నది.

చెలికత్తె తోటలోకి వెళ్ళి ఇన్ని సంపెంగ పూలు కోసి, తీసుకుపోయి రాజు వద్ద ఉన్న రాయబారికి ఇచ్చింది. రాయబారి వాటిని



వాసన చూసి, "మహారాజా, నా పవిత్రమైన సంపెంగపువ్వు వీటిలో లేదు," అన్నాడు.

రాజు మండిపడి, "రాజకుమార్తెను ఆ సంపంగిని వెంటనే ఇయ్యమను. లేకపోతే నేనే వచ్చి తీసుకుంటాను," అని చెలికత్తెతో అన్నాడు. చెలికత్తె వెళ్ళి రాజకుమార్తెతో ఈ మాట చెప్పింది. చేసేది లేక రాజకుమార్తె పువ్వును ఇచ్చేసింది.

రాజు ఆ పువ్వును టర్కీ రాయబారికి ఇవ్వబోతూండగా అది కాస్తా ధాన్యపు గింజగా మారి నేల మీద పడిపోయింది. వెంటనే రాయబారి కాస్తా కోడిగా మారి ఆ గింజను తినబోయాడు. వెంటనే ధాన్యపు గింజ నక్కగా మారి కోడిని తినేసింది.

ఈ మార్పులన్నీ చూసి రాజు వెర్రెత్తి పోయి, "అయ్యో, అయ్యో! ఘోరం, ఘోరం!" అని కేకలు పెట్టాడు.

అంతలో నక్క కాస్తా యువకుడుగా మారి, "మహారాజుగారికి జయం కలగాలి! నేనొక రాజకుమారుణ్ణి. నా తల్లి గంధర్వ స్త్రీ. ఆమె నాకు మంత్ర విద్యలన్నీ నేర్పింది. తమరి వద్దకు వచ్చిన వాడు నా సేవకుడు. వాడు నా విద్యలన్నీ సంగ్రహించి, నన్నే నిర్మూలించటానికి యత్నించాడు. ఒకరికి ద్రోహం తల పెట్టిన వాడికి నాశం తప్పుతుందా?" అన్నాడు.

"అలాగా, నాయనా? నీకు అభ్యంతరం లేకపోతే నా కుమార్తెను చేసుకుని, నా అల్లుడుగా ఉండిపో," అన్నాడు రాజు.

"మీ దయ! నాకు వారం రోజులు గడువిస్తే కొన్ని వ్యవహారాలు చక్కబెట్టుకుని వస్తాను," అన్నాడు విక్రముడు.

రాజు సరేనన్న మీదట అతను పావురంగా మారి, బావి వద్దకు వెళ్ళాడు. అక్కడ అతనికి తన తల్లి కనిపించింది. విక్రముడు తన అసలు రూపం ధరించి తల్లితో, "ఇక్కడేం చేస్తున్నావమ్మా?" అన్నాడు.

"నీ కోసం బెంగపడ్డాను, నాయనా! అబ్బాకు బంగారం తిరిగి ఇచ్చి నిన్ను తెప్పించుకుందామని వచ్చాను," అన్నది తల్లి.

"అబ్బా ఇంకెక్కడున్నాడమ్మా? వాడు పోయాడు. మనం సుఖంగా ఉండవచ్చు. నువ్వు ఇంటికి పద. నేను త్వరలోనే తిరిగి వస్తాను," అని విక్రముడు తల్లిని పంపేసి, డేగ రూపంలో బావి దిగి వెళ్ళి, తోటలో ఉండే అమ్మాయితో, "నువు మీ తల్లిదండ్రుల వద్దకు వెళ్ళిపోతావా? నా వెంట ఉంటావా?" అని అడిగాడు.

ఆమె తన తల్లిదండ్రుల వద్దకు పోతానన్నది. ఆమె కూడా ఎర్ర నీరు తాగి పక్షి రూపం ధరించి బావి నుంచి పైకి వచ్చి తన ఇంటికి వెళ్ళిపోయింది.

డేగ రూపంలోనే విక్రముడు రాజుగారి వద్దకు వెళ్ళి, తన అసలు స్వరూపం తిరిగి పొంది, రాజకుమార్తెను పెళ్ళాడి, తన తల్లిని తెప్పించుకుని, సుఖంగా ఉన్నాడు.





# దుగ్గిశెట్టి

పూర్వం దామరమడుగు అనే గ్రామంలో ఎక్కువమంది ధనవంతులు ఉండేవారు. అదే గ్రామంలో దుగ్గిశెట్టి అనే కోమటి, తన ఇద్దరు కొడుకులతో చిన్న వ్యాపారం చేస్తూ జీవించేవాడు.

దుగ్గిశెట్టి ఒకప్పుడు బాగా ఉన్నవాడే, కాని వ్యాపారంలో అపారంగా నష్టపోయి, ఒక పెద్ద ఇల్లు తప్ప మిగిలిన ఆస్తి అంతా పోగొట్టుకున్నాడు. అయినా ఆయన నిరుత్సాహ పడలేదు; కలిసిరాకపోతుందా అని చిన్న ఎత్తున మళ్లీ వ్యాపారం ప్రారంభించాడు. ముసలితనం ముంచుకొచ్చినా, పూర్వపు స్థితికి తిరిగి చేరుకోవాలన్న ఆశ దుగ్గిశెట్టికి పోలేదు.

ధనిక గ్రామం కావటంచేత దామరమడుగుకు అప్పుడప్పుడూ బందిపోటు బెడద ఉండేది. బందిపోటు దొంగలు వస్తారని తెలియగానే గ్రామస్థులు తమకున్నదంతా ఎక్కడైనా రహస్యంగా పాతిపెట్టో, వెంట తీసుకునో ఇతర గ్రామాలకు పారిపోయేవారు.

అలాటి బెడద మరొకసారి సంభవించింది. బందిపోటు వొస్తున్నట్టు తెలిసి అందరూ గ్రామం ఖాళీ చేశారు. దుగ్గిశెట్టి మటుకు తన కొడుకులతో, "నేను మీతోపాటు రాలేను. రెండురోజులపాటు ఇక్కడే తలదాచుకుంటాను. మన పెరట్లో గడ్డివామి మధ్య కాస్త చోటుచేసి, నాకు కూడూ, నీరూ పెట్టి వెళ్లండి," అన్నాడు.

దుగ్గిశెట్టిని కొడుకులు గడ్డివామిలో ఉపాయంగా దాచి వెళ్లిపోయారు.

బందిపోటు దొంగలు గ్రామానికి రానే వచ్చారు. తన అనుచరులు ధనంకోసం ఇల్లిల్లూ గాలిస్తూ ఉంటే, వారి నాయకుడు గుర్రంమీద వీధి వెంబడి వచ్చాడు. దొంగలు ఊళ్లమీద పడి దోచుకున్నదంతా రెండు

యస్. జహర

సంచులలో గుర్రానికి అటూ ఇటూ వేళ్లాడు తున్నది. లంకంత ఇల్లూ, పెరడూ దొంగల నాయకుడి దృష్టిని ఆకర్షించాయి. ఆ ఇల్లూ, పెరడూ దుగ్గిశెట్టివే.

దొంగల నాయకుడు తన పెరట్లోకి గుర్రం మీద రావటం చూడగానే దుగ్గిశెట్టికి ప్రాణం కడబట్టినట్టయింది. దొంగ చేసేదంతా ఆయన శ్రద్ధగా గమనించసాగాడు.

దొంగల నాయకుడు తన గుర్రాన్ని గడ్డి వామి పక్కన ఒక రాతికి కట్టేసి, ఇంట్లో ఏమైనా దొరుకుతుందేమో చూడటానికి లోపలికి వెళ్లాడు. ఆకలిమీద ఉన్న గుర్రం వామిలో నుంచి గడ్డిలాగి మెయ్యసాగింది.

అదే సమయమనుకుని దుగ్గిశెట్టి గడ్డి వామిలో నుంచి బయటికివచ్చి, గుర్రం కట్టు విప్పి, దానిమీద ఉన్న ధనం సంచులు రెండూ తీసుకుని వామి మధ్యకు వెళ్లిపోయి, గడ్డి అడ్డం పెట్టుకున్నాడు. కట్టు విప్పిన గుర్రం యథేచ్ఛగా పెరడంతా తిరుగుతూ పచ్చిక మేయసాగింది.

ఇల్లంతా గాలించినా దొంగల నాయకుడికి విలువగలది ఏమీ దొరకలేదు. అతను తిరిగి పెరడులోకి వచ్చేసరికి గుర్రం కట్టువిప్పుకుని దూరంగాపోయి గరిక మేస్తున్నది. దానిమీద ధనపు మూటలు లేవు.

మూటలు ఎక్కడ పడిపోయాయో అని దొంగల నాయకుడు పెరడంతా వెతుకు తూండగా అతని అనుచరులు అక్కడికి వచ్చారు. వాళ్లను చూస్తూనే దొంగల నాయకుడు, "గుర్రం మీది రెండు మూట



లనూ మీలో ఎవరన్నా తీశారా?" అని అడిగాడు.

దొంగలు ఒకరి మొహాలు ఒకరు చూసుకున్నారు. తమను మోసం చెయ్యటానికి తమ నాయకుడు దోచినదంతా ఎక్కడో దాచి, అది పోయినట్టు నటిస్తున్నాడన్న అనుమానం సహజంగా దొంగలకు కలిగింది.

"ఊళ్లో మనం తప్ప ఒక్క పురుగూ లేదు. మూటలేమో తేలికైనవి కావు. ఎలా మాయమౌతాయి?" అని దొంగలు తమ నాయకుణ్ణి నిలవదీసి అడిగారు.

పోయిన మూటలకోసం వాళ్లుకూడా తెగ వెతికారు, కాని ప్రయోజనం లేకపోయింది. ఆ మూటల ఆరా తీసే భారం దొంగల నాయకుడు తాను చూస్తానన్నాడు.

మర్నాడు దొంగలు గ్రామం వదిలి వెళ్లారు. వాళ్లు వెళ్లిపోయిన వార్త అందగానే గ్రామస్థులు తిరిగివచ్చారు. దుగ్గిశెట్టి మూటలను తన యింట్లోనే రహస్యంగా దాచాడు. ఆయన తన కొడుకులతో ఈ సంగతి ఏమీ చెప్పలేదు. ఆ మూటల ఆరా తాను తీస్తానని దొంగల నాయకుడు ప్రతిజ్ఞ చెయ్యటం ఆయన విని ఉన్నాడు.

ఆయన అనుకున్నట్టే దొంగల నాయకుడు గుర్రాల వర్తకుణ్ణని చెప్పుకుంటూ ఆ గ్రామం వచ్చి, ఊళ్లో ఉండే ధనికులను గురించి అడగసాగాడు. ఇటీవల అకస్మాత్తుగా ఎవరన్నా ధనికులయారేమో తెలుసుకుందామని వాడి ఉద్దేశం. దుగ్గిశెట్టి వాణ్ణి చూడగానే గుర్తుపట్టాడు.



దొంగ ఆ రాత్రి తన ఇంటికి రావచ్చునని దుగ్గిశెట్టికి అనుమానం తగిలింది. అందుచేత ఆయన వెయ్యి కళ్లతో తన పెరడును కనిపెట్టి ఉన్నాడు. ఆయన అనుమానించి నట్టే, చీకటిపడగానే దొంగ చల్లగా తన పెరట్లో ప్రవేశించి, ఇంటి గోడవార నక్కి కూర్చున్నాడు. ఇంట్లో వాళ్లు తాను పోగుట్టుకున్న ధనం మూటల గురించి ఏమన్నా మాట్లాడుకుంటారేమో వినాలని వాడి ఆశ.

ఇదంతా గమనించిన దుగ్గిశెట్టి పొద్దు పోనిచ్చి తన కొడుకులతో, దొంగకు వినిపించే లాగా, "ఒరే, అబ్బాయిలూ, మొన్న మన పెరట్లో గడ్డిలాగుతూంటే గడ్డికింద రెండు నగల మూటలు కనిపించాయిరా!" అన్నాడు.

కొడుకులు ఆశ్చర్యానందాలతో, "నిజమా? మరి ఆ మాట మాకు చెప్పావు కావేం?" అన్నారు.

"అది ఎవరిదో ఏమిటో తెలియకుండా దాని సంగతి ఎలా బయటపెట్టేదిరా? అందుకని ఆ మూటలను ప్రస్తుతానికి రహస్యంగా దాచి ఉంచాను," అన్నాడు దుగ్గిశెట్టి.

"ఎక్కడ దాచావేం?" అని కొడుకులు తండ్రిని అడిగారు.

"మన పెద్ద బావిలో పడేశాను," అన్నాడు దుగ్గిశెట్టి.

దొంగ ఈ మాట విని సంతోషించాడు. ఊరు మాటుమణిగినాక వాడు తాడు తెచ్చి బావి మీది గిలకకొయ్యకు కట్టి, దాని సహాయంతో బావిలోకి దిగాడు.

వెంటనే దుగ్గిశెట్టి తన కొడుకులకు అసలు సంగతి చెప్పేశాడు. ముగ్గురూ పెరట్లోకి వెళ్లి, దొంగకు ఆధారంగా ఉన్న తాడు కాస్తా కోసేసి, దొంగ నెత్తిన బండ రాళ్లు వేసి, వాణ్ణి బావిలోనే చంపేసి, వాడి శవాన్ని పైకితీసి, తెల్లవారే లోపల తమ పెరట్లోనే పాతేశారు.

తరవాత దుగ్గిశెట్టి ఏ చీకూ చింతా లేకుండా తాను బతికి ఉన్నంతకాలమూ ఐశ్వర్యంలో ఓలలాడాడు.






ఉత్తరుడు కౌరవసేనలను జయించి గోవులను మళ్ళించటానికి సహాయపడిన వాడు ఎవరో దేవుడని విని విరాటరాజు, "నాకు ఇంత మహోపకారం చేసిన ఆ దేవుడు ఎవరో గదా! ఆయనను చూసి, పూజించాలని నాకు కోరికగా ఉన్నది," అన్నాడు.

దానికి ఉత్తరుడు, "ఆ దేవకుమారుడు అక్కడే అంతర్ధాన మయాడు. రేపుగాని, ఎల్లుండిగాని ఆయన మనకు దర్శనమిస్తాడు," అన్నాడు. ఆ దేవకుమారుడు నపుంసకుడి ఆకారంలో తన ఎదటనే ఉన్న సంగతి విరాటరాజు ఎరగడు.

విరాటుడు అనుమతించిన మీదట అర్జునుడు కురువీరుల తలగుడ్డలను ఉత్తరకు ఇచ్చేశాడు.

తరవాత ఉత్తరుడూ, ధర్మరాజూ, అర్జునుడూ జరగవలసిన దాన్ని గురించి ఏకాంతంగా మాట్లాడుకున్నారు.

ఇది జరిగిన మూడోనాడు పాండవులు అయిదుగురూ, కాలకృత్యాలు తీర్చుకుని, చక్కగా స్నానం చేసి, తెల్లని బట్టలు కట్టుకుని, విరాటుడి కొలువు కూటానికి వచ్చారు. వాళ్ళు రాజులు కూచునే ఆసనాలలో కూర్చున్నారు.

కొంతసేపటికి విరాటుడు రాచకార్యాలు చూడటానికి సభాస్థలానికి వచ్చి, ఉన్నతాసనాలలో కూర్చుని ఉన్న పాండవులను చూసి ఒక్క క్షణం నివ్వెరపోయి, మరుక్షణం ఆగ్రహావేశుడై ధర్మరాజుతో, "ఏమయ్యా, నిన్ను నాతో జూదం ఆడటానికి గదా పెట్టు

**43. ఉత్తర వివాహం**



కున్నాను? సింహాసనం మీద కూర్చున్నావు ఎందుచేత?'' అని అడిగాడు.

విరాటుడు పరాచకాలాడుతున్నాడనుకున్న వాడిలాగా అర్జునుడు ఆశ్చర్యం ప్రకటిస్తూ, ''రాజా, ఈ మహాత్ముడు ఇంద్రుడి అర్ధాసనం మీద కూర్చోవటానికి కూడా అర్హుడే. ఈ చిన్న గద్దె మీద కూర్చోదగడా? ఈయన ధర్మస్వరూపుడు. మహాబలశాలి. రాజర్షి. మనువు లాగా లోకాన్ని రక్షించగల వాడు. ఈయన కురుదేశాన్ని పాలించేటప్పుడు, ఈయన వెనక పదివేల గజ బలమూ, ముప్ఫైవేల రథాలూ ఉంటాయి. శకుని కర్ణులు అండగాగల దుర్యోధనుడే ఈయన బలాన్ని తలుచుకుని దిగులు పడతాడు. ఈయన ఈ సింహాసనం మీద కూర్చోవటానికి తగడా?'' అన్నాడు.

విరాటుడీ మాటలకు నివ్వెరపోతూ, ''ఈయన కుంతీదేవి పెద్ద కొడుకైన ధర్మరాజా? అయితే ఈయన తమ్ములైన భీమార్జున నకులసహదేవు లేరీ? ద్రౌపది ఏదీ? వారి జాడ ఏ మాత్రమూ తెలియరాలేదే,'' అన్నాడు.

దానికి అర్జునుడు, ''వల్లవు డనే పేరుతో నీ దగ్గిర వంటలవాడుగా ఉన్నవాడు భీముడు. గంధర్వులను జయించి, ద్రౌపది కోసం సౌగంధిక పుష్పం తెచ్చినవాడు. ఇతనే కీచకుణ్ణి హతమార్చిన గంధర్వుడు. ఆ పని మరొకరివల్ల అవుతుందా? నీ గుర్రాలను చూస్తూ వచ్చినవాడు నకులుడు. గోవులను పాలించినవాడు సహదేవుడు. ఈ ఇద్దరూ మహారథులు. నీ సైరంధ్రి ద్రౌపది. నేను అర్జునుణ్ణి. రాజా, నీ చాటున మాకు అజ్ఞాతవాసం సుఖంగా గడిచింది.'' అన్నాడు.

పాండవులు ఈ విధంగా బయటపడిపోయిన మీదట ఉత్తరుడు అర్జునుడు యుద్ధంలో చూపిన పరాక్రమాన్ని వర్ణించి చెప్పాడు. అతను అర్జునుణ్ణి గురించి చెబుతూ, ''సింహం జింకలను తోలి చంపినట్టు ఈయన కౌరవ యోధులను వేటాడాడు. ఈ మహావీరుడు ఒక్క బాణంతో

ఏనుగును చంపటం నేను చూశాను. ఈయన శంఖం పూరించే సరికి శత్రువుల తోపాటు, నా చెవులూ గడియలు పడి పోయాయి,'' అన్నాడు.

అది విని విరాటుడు, ''నిజమే. ఇప్పుడు పాండవులను మనం మంచి చేసుకోవాలి. అందుకోసం మన ఉత్తరను అర్జునుడికి ఇచ్చి పెళ్ళి చేస్తాను,'' అన్నాడు.

''ముందు మనం పాండవులందరినీ గొప్పగా సన్మానించవలసి ఉన్నది,'' అన్నాడు ఉత్తరుడు.

దానికి విరాటుడు, ''అవును. యుద్ధంలో నేను ఓడిపోయి సుశర్మకు చిక్కినప్పుడు నన్ను విడిపించి, మనకు విజయం సాధించి పెట్టినవాడు భీముడు. పాండవుల సహాయం తోనే మనం గెలిచాం. అందుచేత మనం పాండవుల పెద్ద అయిన ధర్మరాజును సుముఖుణ్ణి చేసుకోవాలి. మనం తెలియక ఏమేమో పేలి ఉంటాం. అదంతా ధర్మ రాజు క్షమించాలి,'' అన్నాడు.

ఇలా అని విరాటుడు ధర్మరాజుకు తన రాజ్యం, ఖజానా, రాజధానీలతో సహా సమ ర్పించి, పాండవులనందరినీ మళ్ళీమళ్ళీ కౌగలించుకున్నాడు.

తరవాత ఆయన ధర్మరాజుతో, ''మీరు క్షేమంగా వనవాసం గడిపి, అమిత కష్టమైన అజ్ఞాతవాసాన్ని గడిపారు. నా రాజ్యాన్ని అర్జునుడికి ఉండనివ్వండి. అతనికి నా కూతు రైన ఉత్తరను ఇచ్చి పెళ్ళి చేస్తాను,'' అన్నాడు.





ధర్మరాజు అర్జునుడి కేసి చూశాడు. అర్జునుడు విరాటుడితో, "రాజా, నీ కుమార్తెను నేను కోడలుగా చేసుకుంటాను. మన వంశాల మధ్య ఇలా సంబంధం ఏర్పడటం ఎంతైనా మేలు," అన్నాడు.

అది విని విరాటుడు ఎక్కడలేని ఆశ్చర్యం కనబరుస్తూ అర్జునుడితో, "నా కుమార్తెను భార్యగా స్వీకరించటానికి అభ్యంతరమేమిటి?" అన్నాడు.

"రాజా, నేను నీ కుమార్తెను చాలా కాలంగా చూస్తున్నాను. ఆమె నన్ను తండ్రిగా చూసుకుంటున్నది. అదీగాక నేను ఆమెకు నాట్యాచార్యుణ్ణి. నా కొడుకు అభిమన్యుడు కృష్ణుడి మేనల్లుడు. చిన్న వాడే, అయినా అస్త్రాలు తెలిసిన వీరుడు. నీ కుమార్తెకు తగిన వరుడు," అన్నాడు అర్జునుడు.

విరాటుడు తృప్తిపడి, "సరే, నీ యిష్ట ప్రకారమే చేస్తాను. నాతోటి సంబంధం నీకు అచ్చివచ్చుగాక!" అన్నాడు.

పెళ్ళి ఎప్పుడు జరగవలసినదీ ధర్మ రాజు నిర్ణయించాడు. విరాటుడూ, అర్జునుడూ మొదలైనవారు కృష్ణుడికి కబురు చేశారు.

అజ్ఞాతవాస సంవత్సరం పూర్తికాగానే పాండవులు విరాటనగరం విడిచి, మత్స్య దేశంలోనే ఉపప్లావ్యం అనే చోటికి మారి, అక్కడ బస చేశారు. అక్కడికి పాండవుల హితులు సైన్యాలతో సహా వచ్చిచేరారు. కాశీరాజూ, శైబ్యుడూ చెరొక అక్షౌహిణీ సేనతోనూ వచ్చారు. ద్రుపదుడూ, ద్రౌపది కొడుకులైన ఉపపాండవులూ, శిఖండీ, ధృష్టద్యుమ్నుడూ ఒక అక్షౌహిణి సేనతో వచ్చారు. విరాటుడు ద్రుపదమహారాజుకు ఎదురువెళ్ళి, పూజించి, సగౌరవంగా తీసుకు వచ్చాడు. ఇలా అనేక మంది రాజులు ఉపప్లావ్యం చేరారు.

ద్వారక నుంచి అభిమన్యుణ్ణీ, ఇంద్రసేనుడు మొదలైన పాండవ భృత్యులనూ వెంటబెట్టుకుని కృష్ణుడూ, బలరాముడూ, కృతవర్మ, యుయుధానుడూ, సాత్యకీ,

అక్రూరుడూ, సాంబుడూ మొదలైనవారు రథాలలో వచ్చి చేరారు.

విరాటుడి ఇంట శంఖాలూ, భేరీలూ మొదలయినవి మోగాయి. అక్కడ విరాటుడు పాండవులను పూజించాడు. అతిథుల కోసం ఎన్నో పశువులను కోశారు. తాగటానికి చెరుకురసం సారా అందించారు. సుధేష్ణ వెంట అంతఃపుర స్త్రీలు చక్కగా అలంకరణలు చేసుకుని, ఉత్తరను పెళ్ళి కూతురుగా అలంకరించారు.

ఉత్తరను అభిమన్యుడికి భార్యగా స్వీకరించటానికి అర్జునుడూ, ధర్మరాజూ అంగీకరించిన మీదట వారిద్దరికీ అర్జునుడు కృష్ణుణ్ణి తన వెంట ఉంచుకుని, వివాహం జరిపించాడు.

అభిమన్యుడి పెళ్ళి జరిగిన మర్నాడు పాండవులు అతిథులందరితోనూ కలిసి విరాటుడి సభాభవనంలో సమావేశమయారు. సభ మధ్య విరాటుడూ, ద్రుపదుడూ, మరి కొందరు వయసు మళ్ళిన రాజులూ కూర్చున్నారు. సభలో వసుదేవుడూ, సాత్యకీ, బలరాముడూ, కృష్ణుడూ, ప్రద్యుమ్నుడూ, సాంబుడూ, అభిమన్యుడూ, ఉపపాండవులూ, పాండవులూ, విరాటుడి కొడుకులూ ఉన్నారు. సభ చాలా శోభించింది.

కొంతసేపు కబుర్లు చెప్పుకున్నాక, కృష్ణుడు అందరినీ ఉద్దేశించి ఇలా అన్నాడు:

"శకుని ఆడిన మాయజూదంలో ఈ ధర్మరాజు ఓడిపోవటమూ, ఇతని రాజ్యాన్ని





దుర్యోధనుడు మోసంతో కాజెయ్యటమూ మీ కందరికీ తెలుసు. బల పరాక్రమాలతో రాజ్యం సంపాదించుకోగలిగి ఉండి కూడా ఈ పాండవులు మాటకు కట్టుబడి, మహా భయంకరమైన వనవాసం పన్నెండేళ్ళు చేశారు. అంత కన్న కూడా కష్టమైనది అజ్ఞాతవాసం. ఇదికూడా వారు జయప్రదంగా ముగించారు. ఏడాది పాటు వీరు దాస్యంలో గడిపారు. ఇకముందు జరగవలిసిన దేమిటో మీరు నిర్ణయించండి. అది ధర్మరాజుకూ, దుర్యోధనుడికీ కూడా నచ్చేదిగానూ, కీర్తి కరంగానూ ఉండాలి, ధర్మ సమ్మతంగా కూడా ఉండాలి. ఈ ధర్మరాజు అధర్మంగా స్వర్గాధిపత్యం వచ్చినా పుచ్చుకోడు. ధర్మం ప్రకారం ఒక చిన్న పల్లెను ఏలుకోమన్నా ఏలుకుంటాడు. ఆయన ఎప్పటికీ ధృత రాష్ట్రుడి కొడుకుల మంచేకోరుతాడు. పాండవులు తమ స్వశక్తిచేత జయించుకున్న రాజ్యాన్నే ఇప్పుడు కోరుతున్నారు. ఉభయ పక్షాల వారూ అన్నదమ్ముల బిడ్డలే గనక ఉభయపక్షాలకూ మేలు జరిగేమార్గం ఆలోచించండి. దుర్యోధనుడు న్యాయంగా వీరి రాజ్యం వీరికిస్తే సరే, అలాకాక మళ్ళీ మోసానికి దిగితే పాండవులు ధృతరాష్ట్రుడి కొడుకులను ఒక్కపెట్టున చంపేస్తారు. దుర్యోధనుడే బలవంతుడనీ, పాండవులు బలహీనులనీ అనుకోనవసరం లేదు. ఇంతకూ దుర్యోధనుడి అభిప్రాయం ఎలా ఉన్నదీ తెలియరాలేదు. అది తెలియకుండా ఏ నిర్ణయంగాని చెయ్యటం సాధ్యం కాదు. కాబట్టి, దుర్యోధనుడి ఉద్దేశం తెలుసుకోవటానికి ఇక్కడి నుంచి ఒక దూతను, కులీనుడూ, జాగరూకుడూ అయిన వాణ్ణి పంపితే బాగుంటుంది. ఆ దూత వెళ్ళి, దుర్యోధనుడికి తగిన విధంగా చెప్పి, పాండవులకు అర్ధరాజ్యం ఇచ్చేటట్టు ఒప్పించి వస్తాడు గాక!"

తరవాత బలరాముడు కృష్ణుడి అభిప్రాయాన్ని బలపరుస్తూ, "ఇక్కడి నుంచి వెళ్ళే దూత భీష్ముణ్ణీ, ధృతరాష్ట్రుణ్ణీ, ద్రోణుణ్ణీ, అశ్వత్థామనూ, కృపుణ్ణీ, శకునినీ,

ఇతర కౌరవముఖ్యులనూ, కర్ణుణ్ణీ కలుసుకుని, వారికి కోపం రాకుండా మంచిగా మాట్లాడి, పని పూర్తి చేసుకురావాలి. నిజానికి శకునితో జూదం ఆడటం ధర్మరాజుదే తప్పు. శకుని పాచికల ఆటలో సాటిలేనివాడు. ధర్మరాజు ఆ సభలో ఇంకెవరితో ఆడినా గెలిచి ఉండేవాడే. ఆడినవాడు ఆవేశంకొద్దీ తనకున్నదంతా పణంగా పెట్టాడు. ఇందులో శకుని చేసిన మోసం ఏమీ లేదు. అందుచేత ఇక్కడి నుంచి వెళ్ళే దూత దుర్యోధనుడి అనుగ్రహం సంపాదించాలి," అన్నాడు.



బలరాముడిలా అనేసరికి సాత్యకికి అమితమైన ఆగ్రహం కలిగింది. అతను చప్పున లేచి, బలరాముణ్ణి నిందిస్తూ, "నీ అంతరాత్మకు తగినట్టే మాట్లాడావు. అందుచేత నీ మీద నాకు కోపం లేదు. కాని నీ అర్థంలేని మాటలు వింటూ కూర్చున్న ఈ సభను చూస్తే నాకు మండిపోతున్నది. జూదంలో ప్రావీణ్యంలేని ధర్మరాజుచేత వాళ్ళు బలవంతాన ఆడిస్తే అది వారికి న్యాయమైన గెలుపు ఎలా అయింది? ధర్మరాజు ఇంటికి వారు వచ్చి జూదమాడి గెలిస్తే అది న్యాయమైన విజయం అయేది. ఏమైనా, జూదంలో ఓడినందుకు పాండవులు ప్రతిజ్ఞ పాలించి వనవాసమూ, అజ్ఞాతవాసమూ చేశారు గద. ఇప్పుడు ధర్మరాజు తన రాజ్యం తాను కోరటానికి యాచించవలసిన పని ఏమిటి? ఏ విధంగానైనా వీళ్ళ రాజ్యం కాజెయ్యాలన్న దురుద్దేశం గల దుర్యోధనాదులు ధర్మమార్గం అవలంబిస్తారనే మాట అబద్ధం. మేమంతా వాళ్ళను హతమార్చి ధర్మరాజుకు రాజ్యాభిషేకం చేస్తాం. ధృతరాష్ట్రుడు జాలి తలిచి ఇచ్చే రాజ్యం ధర్మరాజుకు అవసరం లేదు. ధర్మరాజు అభిప్రాయం తెలుసుకోకుండా ఏమీ చెయ్యవద్దు," అన్నాడు.

తరవాత ద్రుపదుడు మాట్లాడుతూ, "సాత్యకి చక్కగా చెప్పాడు. మంచి మాటలకు కరిగి దుర్యోధనుడు రాజ్యం ఇవ్వడన్నది నిజం. ధృతరాష్ట్రుడికి తన

కొడుకును శాసించే శక్తి లేదు. భీష్మ ద్రోణులు దుర్యోధనుణ్ణి అనుసరించవలసిన దుస్థితిలో ఉన్నారు. కర్ణుడూ, శకునీ మూర్ఖులై దుర్యోధనుణ్ణి సేవిస్తున్నారు. మనం పంపే దూత పని సాధించుకు రావాలంటే మంచిగా మాట్లాడి లాభంలేదని నా నమ్మకం. మంచిగా మాట్లాడటం దుర్యోధనుడి దృష్టిలో అశక్తత అవుతుంది. మనం చేసే ప్రయత్నం చెయ్యాలి. శల్యుణ్ణీ, ధృష్టకేతుణ్ణీ, జయత్సేనుణ్ణీ, కైకేయులనూ, ఇతర రాజులనూ తమ తమ బలాలతో రమ్మని పిలవటానికి వేగంగా దూతలను పంపాలి. దుర్యోధనుడు కూడా ఆ పనే చేస్తాడు. ముందు అడిగినవారికి సహాయం లభిస్తుంది గనక త్వరగా సైన్యాల సమీకరణ చూడండి. ఇది చాలా భారమైన పని. వార్తలు పంపవలిసిన రాజులు చాలా మంది ఉన్నారు. ఇతను నా పురోహితుడు. వృద్ధుడు. ధర్మశీలుడు. ఇతనికి ఏం చెప్పాలో చెప్పి ధృతరాష్ట్రుడి కొలువుకు పంపుదాం," అన్నాడు.

కృష్ణుడు చివరకు మాట్లాడుతూ, "ద్రుపదుడు చెప్పినట్టు చేస్తే పాండవులకు మేలు కలుగుతుంది. చేసేదానిలో రాజనీతి ఉపయోగించాలి. ఇరుపక్షాలవారూ సుఖంగా ఉండగలిగితే మనకు అంతకన్న కావలిసినది లేదు. మనమంతా పెళ్ళికి వచ్చినవాళ్ళం. పెళ్ళి సలక్షణంగా జరిగింది. మన మందరమూ ఇక తిరిగి మన మన చోట్లకు వెళ్ళిపోవచ్చు. ద్రుపదుడు వృద్ధుడు. మన కందరికీ గురువులాటివాడు. ధృతరాష్ట్రుడికి పంపదగిన సందేశం ఏదో ఆయనే చెబితే అక్కడ భీష్మద్రోణులు మొదలైనవారు ఆదరిస్తారు. అది మా కందరికీ సమ్మతమే అవుతుంది. దుర్యోధనుడు ఒకవేళ ఆ సందేశాన్ని లక్ష్యపెట్టకపోతే, మిగిలిన రాజులకు వార్త పంపినట్టే నాకు కూడా పంపండి," అన్నాడు.

ఇలా అని కృష్ణుడు తిరుగు ప్రయాణం అవుతున్నప్పుడు విరాటుడు అతనికి ధన కనకవస్తువాహనాలు కానుకగా ఇచ్చి సంతోషంగా సాగనంపాడు.






## 20

పూర్వం అయోధ్యానగరాన్ని బాహువు అనే రాజు పరిపాలించే వాడు. హైహయులు ఈయన రాజ్యం మీద దాడి చేసి ఇతన్ని వెళ్ళ గొట్టారు. అప్పుడాయన తన భార్యలతో సహా అడవులకు వెళ్ళాడు.

అక్కడ ఉండగా బాహువు భార్యలలో ఒకతె గర్భవతి అయింది. ఇంతలో బాహువు మరణించాడు. గర్భవతి అయిన భార్య తన భర్తతో సహగమనం చేయబోయింది. కాని ఔర్వుడనే ముని ఆమెను వారించి, ఆమెకు కొడుకు కలుగుతాడని చెప్పాడు.

ఇది తెలిసి ఆమె సవతులు ఆమెకు విషం పెట్టారు. ఆ విషంతోసహా ఆమెకు పిల్లవాడు పుట్టాడు. అతనికి సగరుడు (విషంతో కూడినవాడు) అన్న పేరు వచ్చింది.

సగరుడు కాలక్రమాన చక్రవర్తి అయి, ఔర్వుడి సహాయంతో అనేక అశ్వమేధాలు చేశాడు. అతడికి సుమతీ, కేశినీ అని ఇద్దరు భార్యలు. అయితే అతనికి సంతానం లేక పోయింది. అందుచేత ఆయన నగరం విడిచి అడవికి వెళ్ళి, ఔర్వుణ్ణి కలుసుకున్నాడు.

సగరుడి భార్యలకు సంతానం కలుగుతుందనీ, అతను తన భార్యలతో కైలాసానికి వెళ్ళి తపస్సు చెయ్యాలనీ ఔర్వుడు చెప్పాడు. సగరుడు అలాగే కైలాసానికి వెళ్ళి, శివుణ్ణి గురించి తపస్సు చేశాడు. శివుడు సగరుడికి సంతానం కలిగేటట్టు వరమిచ్చాడు.

సగరుడు నగరానికి తిరిగి వచ్చినాక అతని ఇద్దరు భార్యలూ గర్భవతులై, ఇద్దరు మగ పిల్లలను కన్నారు. కేశినికి అసమంజసుడు కలిగాడు. ఔర్వుడు వచ్చి, సుమతికి పుట్టిన వాడిలో అరవైవేలమంది కుమారులున్నట్టు చెప్పి, ఆ బిడ్డను అరవైవేల

అట్ట చివరి బొమ్మ



ఖండాలు చేయించి, కుండలలో పెట్టించాడు. ఆ కుండలలో నుంచి అరవైవేల మంది కుమారులు పుట్టారు.

కేశిని కొడుకైన అసమంజసుడు మహా భయంకరమైన పనులు చేసేవాడు. వాడు చిన్న వాళ్ళనూ, పెద్ద వాళ్ళనూ నదిలో పారేసేవాడు. వాడి చర్యలు సహించలేక ప్రజలు వెళ్ళి సగరుడితో చెప్పుకున్నారు. సగరుడు అసమంజసుణ్ణి నగరం నుంచి వెళ్ళగొట్టించాడు.

తరవాత సగరుడు మళ్ళీ అశ్వమేధ యాగం చేయనిశ్చయించి, యాగాశ్వాన్ని వదిలి, దాని వెంట తన అరవైవేలమంది కొడుకులనూ పంపాడు.

సగరుడు వదిలిన అశ్వం ఒక చోట తిరుగుతూ అకస్మికంగా మాయమయింది. సగరుడి కొడుకులు దాని కోసం వెతికి, వెతికి, లాభం లేక నగరానికి తిరిగి వెళ్ళి, గుర్రం మాయమయిందని తండ్రితో చెప్పారు. సగరుడు వారి మీద మండిపడి, గుర్రం లేకుండా నగరంలోకి అడుగు పెట్టవద్దని కొడుకులను శాసించాడు.

వాళ్ళు గుర్రం మాయమైన చోటికి వెళ్ళి అక్కడ తవ్వ నారంభించారు. వాళ్ళు అలా పాతాళలోకం దాకా తవ్వుతూ వెళ్ళినాక, వారికి తపస్సు చేసుకుంటున్న కపిలమహాముని కనిపించాడు. ఆయన సమీపంలోనే యాగాశ్వం నిలిచి ఉన్నది.

ఆయనే గుర్రాన్ని దొంగిలించాడనుకుని సగరుడి కొడుకులు ఆయనను పట్టబోయి, ఆయన కళ్ళు తెరిచి చూసేసరికి అరవైవేల మందీ అరవైవేల బూడిద కుప్పలు అయిపోయారు.

ఈ వార్త నారదుడి ద్వారా సగరుడికి తెలిసింది. ఆయన గుర్రాన్ని ఎలాగైనా తీసుకు రమ్మని, అసమంజసుడి కొడుకైన అంశుమంతుణ్ణి పంపాడు.

అంశుమంతుడు పాతాళలోకం చేరి, కపిలుడున్న చోటికి వెళ్ళి, గుర్రాన్ని అడగకుండా కపిలుడికి నమస్కారం చేస్తూ నిలబడ్డాడు.

కపిలుడు అతన్ని చూసి సంతోషించి, "నాయనా, గుర్రాన్ని తీసుకుపో. వీళ్ళందరూ ఇక్కడ భస్మమైనారని మీ తాతతో చెప్పు," అన్నాడు.

"మహాత్మా, ఈ చనిపోయిన తండ్రులకు స్వర్గప్రాప్తి కలిగే మార్గం చెప్పండి," అని అంశుమంతుడు కపిలుణ్ణి వేడుకున్నాడు.

"వీళ్ళ పాపం ఇంకా కొన్ని జన్మలెత్తితే గాని తీరదు. నీకు కలగబోయే మనమడి ద్వారా వీరికి ముక్తి లభిస్తుంది," అని కపిల మహాముని అంశుమంతుడికి చెప్పాడు.

అంశుమంతుడు యాగాశ్వాన్ని తెచ్చి సగరుడికి ఇచ్చాడు. సగరుడు అశ్వమేధ యాగం పూర్తి చేసి, అంశుమంతుడికి పట్టాభిషేకం చేశాడు.

రాజైనాక కూడా అంశుమంతుడికి తన తండ్రుల ముక్తి గురించి విచారం పట్టుకున్నది. ఒకసారి గరుత్మంతుడు అతనితో, "గంగను నీ తండ్రుల భస్మం పైన ప్రవహింప జేస్తే వారికి సద్గతులు కలుగుతాయి," అని చెప్పాడు.

గంగను భూమికి అవతరింప జెయ్యటానికై అంశుమంతుడు, తన కొడుకైన దిలీపుడికి పట్టం గట్టి, తాను అరణ్యాలలో తపస్సు ప్రారంభించాడు. కాని ఆ తపస్సు ఫలించకుండానే అతను చనిపోయాడు.

దిలీపుడి కొడుకు భగీరథుడు. అతను తన తాతలకు కలిగిన దుస్థితి గురించి విని, వారిని ఎలాగైనా ఉద్ధరించాలన్న కోరిక కలిగి బ్రహ్మను ఆరాధించాడు.



బ్రహ్మ ప్రత్యక్షమై, భగీధుడు ధర్మం తప్పకుండా తన ఇష్టం వచ్చిన రీతిగా జీవించేటట్టు వరం ఇచ్చాడు.

తరవాత భగీరథుడు గంగను గురించి దీర్ఘకాలం తపస్సు చేశాడు. గంగాదేవి అతనికి సాక్షాత్కరించి, అతని కోరిక విని, "నేను స్వర్గం నుంచి భూమి మీదికి పడేటప్పుడు నా వేగాన్ని ఎవరు ఆపగలరు? నేను భూమిని బద్దలు చేసుకుని తిన్నగా పాతాళానికి దిగిపోతాను గదా?" అని భగీరథుణ్ణి అడిగింది.

"తల్లీ, ప్రపంచమంతా తనలో ఇముడ్చుకున్న శివుడు నిన్ను భరించ గలుగుతాడు," అన్నాడు భగీరథుడు.

"నేను ఒక వేళ భూమికి వస్తే పాపులందరూ తమ పాపాలను నాలో కడుగుకుంటారు. అలా సంప్రాప్తమైన ఆ పాపాలను నేనెలా వదిలించుకోను?" అని గంగ మళ్ళీ అడిగింది.

"దేవీ, అన్ని పాపాలనూ హరించగల హరిని తమలో నిలుపుకున్న పుణ్యాత్ముల స్నానం చేత, పాపాత్ములు నీలో కలిపే పాపాలు పరిహారమవుతాయి," అన్నాడు భగీరథుడు.

"సరే, నీ కోరిక నెరవేర్చుతాను. స్వర్గం నుంచి పడేటప్పుడు నన్ను భరించేటట్టు శివుణ్ణి ఒప్పించు," అని గంగ అంతర్ధానమయింది.

భగీరథుడు శివుణ్ణి గురించి తపస్సు చేసి ఆ దేవుణ్ణి సులభంగానే ప్రత్యక్షం చేసుకుని, ఆయనకు తన కోరిక తెలిపాడు.

గంగను భరించటానికి శివుడు అంగీకరించాడు.

ఆకాశం నుంచి గంగ తిన్నగా శివుడి శిరస్సు మీద పడింది; తరవాత శివుడి జడల నుండి జారి భూమిపైన ప్రవహించ నారంభించింది. భగీరథుడు వాయువేగం గల రథం మీద దారి తీస్తూ పోతూ ఉంటే గంగ అతని వెనకగా వెళ్ళి, సగరుడి కొడుకుల భస్మ రాసుల పైన ప్రవహించి సముద్రం అయింది. అందుకే సముద్రానికి సాగరం అనే పేరు వచ్చింది.



# 130. రెండువేల ఏళ్ళనాటి పంటకాలువ

చీనాలో క్రీస్తు పూర్వం 250కి పూర్తి అయిన ఈ కాలువ 8 లక్షల ఎకరాలకు పైగా సాగుచెయ్యటానికి వినియోగపడుతున్నది. దీని నిర్మాణం క్రీ. పూ. ఆరవశతాబ్దిలో ప్రారంభమయింది. దీని నిడివి 1200 మైళ్ళు. ఇది పీకింగ్ నుంచి హాంగ్‌చో దాకా విస్తరించి ఉన్నది. దీనిని మట్టితోనూ, రాళ్ళతోనూ, కలపతోనూ నిర్మించారు.



Photo by P. D. Ashtekar



బహుమతి
పొందిన వ్యాఖ్య

నాకు నచ్చాడు

పంపినవారు :
ఎస్. రషీద్ అహమ్మద్

Photo by P. D. Ashtekar



నన్ను మెచ్చాడు

మార్కాపురం.
(కర్నూలు జిల్లా)

బహుమతి
పొందిన వ్యాఖ్య

## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 20 లు



*



★ వ్యాఖ్యలు అక్టోబర్ నెల 20 వ తేదీలోగా చేరాలి.

★ వ్యాఖ్యలు ఒక్కమాటలోగాని, చిన్న వాక్యంలోగాని వుండాలి. రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి. గెలుపొందిన వ్యాఖ్యలు డిసెంబర్ నెల సంచికలో ప్రకటించబడును.

# చందమామ

## ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు



రెండవ అట్ట :
దేవుడి ఊరేగింపు

మూడవ అట్ట :
పెళ్ళికూతురి ప్రయాణం


Printed by B. V. REDDI at The Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for Chandamama Publications, 2 & 3, Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'




నమస్కారం. నేను జమిందార్ వేణుగోపాల రావుగారి అబ్బాయిని. మా అమ్మ పేరు జానకమ్మ. మాది ఆనందభవనం. లేక లేక పుట్టానని మా అమ్మకీ, నాన్నకీ నేనంటే బోలెడెంత యిష్టం.

నాకొక మంచి నేస్తం ఉంది. దాని పేరు టామీ. టామీ అనగానే మామూలు కుక్క పిల్ల అనుకోకండి. అది మంచి తెలివిగలది. మాట్లాడ్డం రాకపోయినా నా మాట దానికి అర్థమవుతుంది. నేను చెప్పిందల్లా చేస్తుంది. రామయ్య తాతకి మే మిద్దరమంటే చెప్పలేనంత ఇష్టం. మాతో ఆడుకుంటూ ఉండేవాడు.

మా పతి మావయ్య నా కోసం ఎప్పుడూ బొమ్మలు, బిస్కట్లూ అవీ బోల్డు తెస్తూ ఉండేవాడు. ఆయనకి ఎంత పెద్ద ఉద్యోగమనీ? ఎంచక్కా నే ఆకాశంలో విమానం నడుపుతారు.

ఇక మా ఇంట్లో ఉన్న దొంగల గురించి చెబుతాను. భయపడకండి: దొంగలంటే నిజంగా దొంగలు కారు. వీళ్ళంతా మా నాన్నగారి దగ్గరున్న డబ్బంతా 'అచ్చంగా' లాగేసుకోవాలని చూస్తున్నారట- మా రామయ్య తాత చెప్పాడు.

ఇందులో మొదటి దొంగ సుబ్బమ్మ. ఆవిడ కొడుకు చంటిబాబు. వాడో తిండిపోతు. నే పుట్టకముందు మా నాన్నకి చంటిబాబుని పెంపకమిద్దామనుకుందిట. ఆవిడ పప్పులుడకలేదులెండి: ఇంతలో నేను పుట్టేశాగా!

ఇహపోతే నరశింహం. రాక్షసుడిలా ఉంటాడు. అతను ఎప్పుడూ సీసాల్తో తాగుతూ ఉంటాడు. అది ఐపోతే మా నాన్నగారి దగ్గర బోలెడు రూపాయలు అడిగి తీసుకు పోతూంటాడు. కొత్త సీసాలు కొనుక్కోడానికి కాబోలు!



మరో ఆవిడ దుర్గమ్మ. ఈవిడకి గీత అని ఓ కూతురుంది. నే నసలు ఎప్పటికీ పుట్టనని గీతని మా నాన్న కిచ్చి రెండో పెళ్ళి చేద్దామనుకుందిట యీ దుర్గమ్మ. ఎంత ధైర్యం !

వీళ్ళల్లో ఎవరో కాని నేను రేపు పుడతా ననగా మా అమ్మని మెట్ల మీంచి తోసేశారట. అమ్మ పడిపోయింది. పెద్ద దెబ్బ తగిలిందట. నేనుంటే ఆ దొంగ వెధవని పట్టుకునే వాణ్ణే! కానీ అప్పటికి నేను అమ్మ కడుపులోనే ఉన్నాగా !

ఆస్పత్రిలో నేను పుట్టాను. కానీ అమ్మకు తగిలిన దెబ్బవల్ల, యిక ముందు నాకు తమ్ముళ్ళుగాని, చెల్లాయిలు గాని పుట్టరని డాక్టరు చెప్పాడట. అయినా అమ్మా నాన్నా నన్ను చూసి ఆనందించారు. రోజూ నాన్న నాకు ముద్దు పెట్టి తన గుండెల మీదే పడుకోబెట్టు కోవాలనుకునేవాడు. కానీ, అమ్మేమో తన ఒడిలో పడుకో బెట్టుకుని జోలపాట పాడుతుండేది. అందుకని ఇద్దరికీ తగాదా రాకుండా నా పక్కనే ఇద్దరూ పడుకునేవాళ్ళు. అలా నేను పెరిగి పెద్ద వాణ్ణయ్యాను.

ఒక రోజు నేను డిష్షూం....డిష్షూం...సిని మాల్లో తుపాకీ రాజాలా వేషం వేసుకుని, చంటిబాబుని ఏడిపిస్తున్నాను.

అమ్మా నాన్న నా ఆట చూసి నవ్వుకున్నారు. మా చుట్టాలంతా యిష్టమున్నా లేకపోయినా, ముక్కుల మీద వేళ్ళేసుకున్నారు ! యీలోగా మా కెప్టెన్ మావయ్య నాకో విమానం, తుపాకీ తెచ్చి పెట్టాడు. తుపాకీ చాలా బాగుంది. నే నది తీసుకుని చుట్టాల్ని కాల్చబోయాను. ఎవరికి వాళ్ళు పరుగెత్తి గుడిగుడి గుంజంలాగా తిరుగుతున్నారు. నేను సరిగ్గా గురి చూసి చంటిబాబుని ఢామ్మని పేల్చి పారేశాను. వాడు

కొబ్బరి బొండాంలా దుబుక్కున పడి పోయాడు. వాళ్ళ అమ్మ వాడు అచ్చంగా చచ్చిపోయాడనుకుని కుయ్యో మొర్రోమని శోకాలు పెట్టింది. అది చూసి మావయ్యా, అమ్మ, నాన్న నవ్వుకున్నారు. నాకూ నవ్వొచ్చింది.

నవ్వుతూ ఉండగా నాకు దగ్గొచ్చింది. సోఫా మీద పడిపోయాను. సోఫా అంతా రక్తమయింది. అమ్మా, నాన్న కంగారు పడిపోయారు.

డాక్టరు నాకు క్షయరోగమని అమ్మా, నాన్నలతో చెప్పాడు. అమ్మ అది భరించ లేకపోయింది. పతి మావయ్య నాన్నకు ధైర్యం చెప్పాడు. డాక్టరు పతి మావయ్యతో నన్ను స్విట్జర్లెండ్ తీసుకెళ్ళాలని చెప్పాడు. అమ్మ మాతోపాటు తనూ వస్తానని ఏడ్చింది. నాన్న, మావయ్య, తన ఆరోగ్యం బాగా లేదని, ఒద్దని చెప్పి ఒప్పించారు. అలారం గడియారాన్ని నాన్న నా కిస్తూ, వెళ్ళే దారిలో అది మోగినప్పుడల్లా నేను మందులు వేసుకోవాలని చెప్పాడు.

నేనూ టామీ విమానం ఎక్కాం. విమానం లోంచి చూస్తూంటే ఏడుస్తున్న అమ్మను నాన్న ఓదారుస్తున్నారు. విమానం వెళ్ళి పోతూంది. కింద ఇళ్ళు, కార్లు అన్నీ చీమల్లా కనిపిస్తున్నాయి. కెప్టెన్ మావయ్య చాలా హుషారుగా విమానం నడిపేస్తున్నాడు. నేనూ, టామీ కిటికీలోంచి అన్నీ చూస్తూ కూర్చున్నాం.

ఇంతలో ఏమయ్యిందో ఏమో! మా విమానం నేల మీదకి కూలిపోతూంది.



నాకు తెలివొచ్చేసరికి మా విమానం ముక్కలై పడుంది. అదో కొత్తచోటు. టామీ ఓ మూల మొరుగుతూ వుంది. మావయ్య కోసం వెతి కాను. విమానం పక్కన, మావయ్య పడి పోయి ఉండటం కనిపించింది. దగ్గర కెళ్ళి కదిపేసరికి, మావయ్య చచ్చిపోయాడని తెలిసింది. నాకు భయమేసింది. ఏడుస్తూ వున్న నాకు పెట్టెలోని అలారమ్ వినిపించింది. పెట్టె తీసి మందు వేసుకున్నాను. ఇంతలో విమానంలో ఏవో మాటలు వినిపించాయి. 'గోపీ ఎక్కడున్నావు బాబూ' అనే నాన్న మాట వినబడగానే నాకు భలే సంతోషం కలిగింది. నాన్న, నేనూ రేడియోలో చాలాసేపు మాట్లాడుకున్నాం! మావయ్య చచ్చిపోయాడని చెప్పాను. అమ్మని మాట్లాడమని అడిగాను. అక్కడేం జరిగిందో ఏమో,



అమ్మ పాట మాత్రమే వినిపించింది. ఇవ్వాల్టికి చీకటి పడిపోయిందీ, రేపొచ్చి తీసుకెళతామని చెప్పారు నాన్న.

ఈ రాత్రంతా ఇక్కడే ఒక్కణ్ణీ ఉండాలని అనుకోగానే నాకు భయం వేసింది. చుట్టూ చూశాను. చీకటి పడిపోయింది. 'గుంయ్యి' మని కీచురాళ్ళ మోత, దూరంగా ఏవో జంతువుల అరుపులు వినిపిస్తున్నాయ్. టామీ కేసి చూశాను. దానికీ భయంగా వుంది. ఇంతలో దూరంగా ఉన్న కొండ ప్రక్కన రెండు పెద్ద కళ్ళు కనిపించాయి! భయమేసి విమానంలోకి పారిపోయాను టామీతోసహా. ఆ రెండు కళ్ళూ మా వైపుకే వస్తున్నాయి. అదొక రాక్షసిలాగా వుంది. అది మమ్మల్ని చంపడానికి విమానంలోకి వచ్చేసింది. భయంతో కేకలు పెట్టాను. చివరికి మావయ్య ఇచ్చిన తుపాకీ తీసి పేల్చేశాను. అది చావలేదు గానీ భయంతో పారిపోయింది.

అప్పుడు రేడియోలో నాన్నతో ఆ రాక్షసి గురించి చెప్పాను. నాన్న పక్కనే ఉన్న విమానాల ఆఫీసరొకాయన, మా విమానంలో వెనకాల పెట్రోలు టిన్ను ఉందనీ, అది తీసి నేలపై పోసి మంట చేస్తే ఆ రాక్షసి ముండ పారిపోతుందనీ చెప్పాడు. నే నలాగే మంట చేసి, టామీని ఒళ్ళో పెట్టుకుని కూర్చున్నాను! ఆ రాక్షసి మా వంకే చూస్తూ, దూరంగా కూర్చుని వుంది. ఇంతలో విమానంలోంచి అమ్మ మాటలు వినిపించాయి. అమ్మ గొంతు వినగానే ఆనందంగా లేచి, విమానంలోకి వెళ్దామనుకున్నాను! ఆ రాక్షసి నేను లేవగానే, పారిపోతున్నాననుకుందో ఏమో, వేగంగా నా పైకి రాబోయింది. దీని పని ఇట్లావుందా అనుకుని పెట్రోలు టిన్ను వంచి, ఆ మంట పైన ఉన్నదంతా పోసేశాను! టిన్ను అంటుకుంది.

ఆ టిన్ను అంటుకున్న మంటల వల్ల విమానం మొత్తం కాలిపోయింది. రేడియో కూడా కాలిపోవటం వలన, అమ్మ నాతో ఏం చెప్పాలనుకుందో నేను తెల్సుకోలేకపోయాను. ఇంక ఎట్లా? ఇప్పుడు నేను అమ్మతో గానీ, నాన్నతో గానీ మాట్లాడలేను. ఎవరి మాటలూ నాకు వినిపించవు. నేను అమ్మదగ్గరకు ఎట్లా వెళతానో? ఎప్పుడు వెళతానో అనుకోగానే నాకు భయమేసింది! ఏడుపు వచ్చింది! టామీని కౌగలించుకుని ఏడుస్తూ పడుకున్నాను!

తెల్లవారింది. మామూలుగా ప్రక్కని అమ్మా నాన్న కనిపిస్తారని కళ్ళు తెరిచాను. కానీ, జరిగిందంతా భయంకరంగా గుర్తు కొచ్చింది.

నిన్నటినుంచీ అన్నం తినలేదుగా! ఒక వైపు ఆకలి వేస్తూంది. దాహం విపరీతంగా అవుతూంది. దగ్గరలో వున్న ఒక కొండ ఎక్కి చూస్తే.

ఎక్కడో దూరంగా ఒక నది ఉన్నట్లని పించింది. టామీ నేనూ బయలుదేరాం.

ఎంత దూరం నడిచినా నీళ్ళు ఇంకా ముందు ఉన్నట్లనిపిస్తోంది. పరుగెత్తి పరుగెత్తి అలిసిపోయాను. అప్పుడు నాకు గుర్తొచ్చింది—అవి పుస్తకాల్లో చదువుకునే ఎండమావులని!

ఏం చెయ్యాలి చెప్మా అని ఆలోచిస్తూ కూర్చున్నాను. ఇంతలో టామీ ఒక చోట గొయ్యి తవ్వింది. కాసిని నీళ్ళు ఊరాయి. నాకు ప్రాణం లేచి వచ్చింది. గబగబా నేనూ వెళ్ళి గొయ్యి తవ్వాను. ఆ నీళ్ళే టామీ నేనూ త్రాగబోతున్నాం. అంతలో ఆ రాక్షసి ముండ మళ్ళీ ఎట్లా వచ్చిందో, మా మీదకి వచ్చేస్తూంది. భయంతో పరుగెత్తుకెళ్ళి, దగ్గరున్న చెట్టు ఎక్కేశాను. ఆ రాక్షసి ముండ టామీ వెనకాల పడింది. టామీ భయంతో పరుగు తీసింది.

నా బంగారు టామీని ఆ రాక్షసి చంపేసింది. నాకున్న కాస్త తోడునీ ఆ పాడు ముండ చంపి తినేసింది. 'నా కోసం నువ్వు చచ్చిపోయావా టామీ' అని దాన్ని తల్చుకుని ఏడ్చాను. మరేం చెయ్యగల్ను?



ఒక ప్రక్క ఆకలి ప్రాణం తోడేస్తుంది. పోనీ ఎలాగో కొద్ది దూరం నడుద్దామా అంటే, ఇసుకలో కాళ్ళు మాడిపోతున్నాయి. ఆ ఎండకి ఎక్కడైనా, కాస్త నుంచునే నీడ కూడా దరిదాపుల్లో లేదు.

ఒక ఎండి పోయిన చెట్టుకి, పిచ్చుక గూళ్ళు వేలాడుతూ ఉండడం కనిపించింది. ఆ చెట్టు ఎక్కి, ఆ గూళ్ళలో ఉన్న పిచ్చుక గుడ్లు తీసుకున్నాను. మూడు రాళ్ళు తెచ్చి పొయ్యి రాజేసి, ఒక పలక రాతిని సంపాదించి పెనంగా పెట్టాను. గుడ్లలో వుండేదాన్ని స్పూనుతో కలుపుతూ చిన్న చిన్న ఆమ్లెట్లు వేశాను. అమ్మయ్యా, అవి తినేసరికి కాస్త బలం వచ్చినట్లయింది. మళ్ళీ నడక ప్రారంభించాను. ఏకాకిలా నడుస్తున్నాను. ఇంతలో ఇసుక దుమారం



రేగింది. అబ్బ! అదేం దుమారమోగానీ, క్రింద ఉండే ఇసుకంతా పైకి లేచి కళ్ళల్లో పడుతూంది! ఏమీ కనిఫించటంలేదు!

ఇంతలో నా టామీ దూరం నుంచి అరుస్తూ పరుగెత్తుకు రావటం కనిపించింది.

నా టామీ చచ్చిపోలేదన్నమాట! ఆ రాక్షసిని 'బురిడీ' కొట్టించి నా దగ్గర కొచ్చేసింది. ఇద్దరం ఒకళ్ళనొకళ్ళం కౌగలించుకుని ఆ యిసుకలో దొర్లాం. టామీ వెళ్ళిం తర్వాత ఏ మేం జరిగిందో అంతా టామీకి చెప్పాను· దాన్ని చూస్తే నాకే జాలేసింది. పాపం! దానికి ఏదైనా తింటానికి దొరుకుతుందేమోనని బైల్దేరాం. ఎంతసేపు తిరిగినా ఏదీ దొరకలా! ఇంతలోఒక పుట్ట కనిపించింది. అది పగలగొడితే దానిలో చెద పురుగులు ఉన్నాయి. అవి తీస్తుంటే కుడుతున్నాయి. అలాగే తీసి టామీకి పెట్టా. టామీ ఎంత బ్రతిమాలినా తినలేదు. నేను తినేశా. తింటుంటే కొన్ని చేతులు కుట్టాయి. కొన్ని లోపల నాలుకని కూడా కుట్టాయి! అయినాసరే ఊదుకుంటూ తినేశా.

మళ్ళీ నడక ప్రారంభించాం. నాకంతా అయోమయంగా వుంది. అతీ, గతీ లేని ఆ ఎడారిలో నేను బైట కొస్తున్నానో లోపలికెళుతున్నానో నా కర్థం కావటం లేదు. ఆ హోరుగాలి శబ్దంలో నా గుండె కొట్టుకోవటం నాకే వినిపిస్తూంది.

ఇంతలో నాన్న కీ యిచ్చిన అలారం గడియారం గంట కొట్టింది. అక్కడ ఆగి మందు వేసుకుందామని పెట్టి తెరిచి, మందు తీశా.

పీడ వదిలి పోయిందనుకున్న రాక్షసి, ఎంతసేపట్నుంచి మా వెనకే వస్తుందో, గబుక్కున టామీని నోటితో కరిచి పట్టుకుని పారిపోబోయింది. నాకేం తోచలా, చేతిలో వున్న మందులు, గడియారం ఏది అందితే

అది దాన్ని కొట్టడానికి విసిరేశాను. అది టామీని అక్కడే వదిలి పారిపోయింది. కానీ, పాపం! టామీ ఒంటి నిండా రక్తం చిమ్మింది. ఆ రాక్షసి కోరలు నా చిన్నారి టామీ ఒంటి నిండా దిగాయి కాబోలు! టామీ బాధగా అరుస్తూంది. నా చొక్కా చించి కట్టు కట్టాను. ఇక మీదట నడవలేదు కనక దాన్ని ఎత్తుకుని, పెట్టె అక్కడే వదిలేసి బయల్దేరాను. ఇంతలో ఒక కాగితం ముక్క కనిపించింది.

అందులో "అమ్మా నాన్నా నిన్ను మర్చిపోలేదు బాబూ. నీ కోసం వెదుకుతున్నారు. నువ్వు ఎక్కడున్నదీ మాకు తెలియాలంటే యీ క్రింది విధంగా చెయ్!" అని వుంది. మిగతా ముక్క చిరిగిపోయింది. అందులో ఏం చెయ్యాలో వుందన్నమాట. అది దొరికితే, నేను త్వరగా అమ్మా నాన్నల్ని కలుసుకోవచ్చు కదా అనే ఆనందంలో చుట్టూ వెదుకుతున్నాను.

యీలోగా టామీ భయంగా మొరగటం ప్రారంభించింది. తిరిగి చూశా! అంతే! ఒక పెద్ద పాము టామీని కాటెయ్యాలని చూస్తూంది. టామీని ఎలాగైనా రక్షించాలని, పరుగెత్తుకు వచ్చి వంగి దాన్ని దగ్గరకు తీసుకున్నా. అంతే! ఆ పాడు పాము సరిగ్గా నా కళ్ళల్లో విషం చిమ్మింది. ఒక్కసారి కళ్ళు భగ్గుమన్నాయి. లోపల నరాలన్నీ రంపంతో కోస్తున్నట్లయి పోయింది. బలవంతాన కళ్ళు తెరచిచూశాను. నా కంటికి ఏమీ కనిపించలా! అంతా చీకటైపోయింది. నా టామీ ఏడుస్తుంటే దాన్ని అట్లాగే దగ్గరకు తీసుకుని నడవడం ప్రారంభిం



చాను. ఎటు వెళితే ఏం ఉందో తెలియదు. అంతా చీకటిగా వుంది! ఎక్కడ వెళ్ళాలి? ముందు ఏదైనా నీడకు చేరుకోవాలని, చేతుల్తో తడుముకుంటూ, బయల్దేరాను టామీని ఎత్తుకునే.

ఐతే అలా కూడా ఎక్కువసేపు నడవలేక పోయాను! నా కాళ్ళ క్రింద ఏదో గట్టిగా తగిలింది! ఏదో చురుక్కుమంది! తేలు కుట్టినపుడు కలిగే నొప్పి కలిగింది! అది తేలో, మండ్రగబ్బో అయివుంటుందనుకున్నాను. కళ్ళు తిరిగాయి. నడవాలని ఉన్నా, నడవలేక ఆ ఎండలో, ఇసుకలో అలాగే స్పృహతప్పి పడిపోయా.

అలా ఎంతసేపు పడివున్నానో నాకే తెలీదు. కళ్ళు తెరిచేసరికి ఒక భయంకరమైన కోయగూడెంలో వున్నాను.

ఇంతలో కోయ దొర నాకు ఒక ఆకులో మాంసం ముక్కలు పెట్టి యిచ్చాడు. ఆకలితో వున్నానేమో ఆదుర్దాగా తినబోయాను! టామీ గుర్తొచ్చింది! చుట్టూ చూశాను! నా టామీ కనిపించలేదు.

వీపుమీదెవరో చరిచినట్లయింది! ఆకులో వున్న మాంసం ముక్కల మధ్య నుంచి నా టామీ మొహం నా కేసి జాలిగా చూస్తూ— 'నన్నే తింటావా నేస్తం' అని అడుగుతున్నట్లనిపించింది. యీ దుర్మార్గులు నా టామీని చంపేశారనే కోపం పట్టలేక, చేతి కందిన రాళ్ళు వాళ్ళపైకి విసిరేశాను. ఒక రాయి కోయదొర కొడుక్కి తగిలింది. అతనూ నా వయస్సు కుర్రవాడే. అతడికి రాయి తగలగానే నెత్తురు చిమ్మింది. దాంతో కోయ దొరకి కోపం వచ్చి, చేసిన మేలు మరిచానని స్థంబానికి కట్టేశారు. వాళ్ళ దేవతకి నన్ను బలి యియ్యాలని వాళ్ళు మాట్లాడుకున్నారు.

నాకు భయం వేసింది. ఎన్ని గండాలు తప్పించుకున్నా, వాళ్ళ చేతుల్లోంచి తప్పించుకోవటం జరగదని అనుకున్నాను. నన్ను బలి చేస్తారని ఊహించుకుంటేనే మూర్ఛొచ్చినంత పనౌతూంది. వాళ్ళ దేవత నాలిక నుంచి రక్తం బొట్లు కారుతున్నాయి! అది చూడగానే నేను మరింత వణికిపోయాను.

వాళ్ళు మాత్రం ఇక నా గొడవేమో పట్టించుకోకుండా, నర్సింహం బాబాయి తాగేలాంటిదే. ఏదో పీపాల్లోనించి పోసుకుని తాగి, డప్పులు మోగిస్తూ, పెద్ద జాతర చేస్తున్నారు. ఆఖరిసారి అమ్మని, నాన్ననీ తల్చుకుందామని కళ్ళు మూసుకున్నాను. ఇంతలో ఒక చిన్న చెయ్యి నా కట్లు ఊడదీస్తోంది! కళ్ళు తెరిచి చూశాను. నేనెవర్నయితే రాయి పుచ్చుకు కొట్టానో ఆ కోయల కుర్రాడే నన్ను విడిపించి బయటకు తెచ్చాడు. అతడి చేతిలో నా టామీ ఉంది. ఆశ్చర్యం! దాని ఒంటినున్న గాయాలన్నీ మాయమైనాయి!

మొదట తెలియక తనను కొట్టినందుకు క్షమించమని ఆ కోయల కుర్రాణ్ణి అడిగాను! నా టామీ గాయాలు నయం చేసినందుకు 'థాంక్స్' చెప్తూండగా-ఆ కుర్రాడు ముందు అక్కణ్ణుంచి వెళ్ళిపొమ్మనీ లేకపోతే వాళ్ళు వాళ్ళు నన్ను బ్రతకనియ్యరనీ చెప్పాడు. మనసులోనే అతనితో జట్టు కట్టుకుని పరుగు తీశాను టామీతో.

నేను పారిపోయిన సంగతి ఆ కోయలకు తెలిసింది. బిగ్గరగా అరుస్తూ నా వెంట పడ్డారు. వాళ్ళ కేకలకు ఆడవి అంతా దద్దరిల్లిపోతూంది. వాళ్ళ నుండి తప్పించుకునేందుకు నేను, టామీ బలంకొద్ది పరుగెత్తాం. కాళ్ళలో ముళ్ళు దిగుతున్నాయి. పొదల మధ్యగా దూరటంలో కొమ్మలు ఒళ్ళంతా గీచుకొని పుళ్ళు పడుతున్నాయి.

ఒక ప్రక్కన ఏనుగులు, మరొక ప్రక్కన పులులు, వెనుక తరుముకు వస్తున్న కోయవాళ్ళు, ముందు అడవి అంటుకొని చెలరేగిన మంటలు వీటన్నిటి నుండి నేనూ నా టామీ ఎలా బ్రతికి బయటపడ్డామో త్వరలో ఒక్కసారిగా అన్ని ఊళ్ళకు వస్తున్న శ్రీ లక్ష్మి ప్రొడక్షన్స్ వారి "పాపం పసివాడు" చిత్రంలో చూడండి.

